శ్రీః.

జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము




(పదునైదవ సంచిక PART II)





ఇది,

శ్రీమాన్, బ్రహ్మశ్రీ బెంగుళూరు

పండిత శ్రీనివాస భాగవత స్వాములవారిచే

నుపన్యసింపబడి

శ్రీయుత సి. యస్. రావుగారిచే వ్రాయబడి

మద్రాసు

శ్రీలక్ష్మీ నృసింహ విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

30-10-14.

COPIES AVAILABLE AT Y. GOVINDARAJULU CHETTY:
NO. 19, STROTTEN MOOTHIA MUDALY STREET: MADRAS.

(పదునైదవ సంచికానుబంధము.)

శ్రీయుత, సి. యన్. రావుగారు యిటుల వ్రాసిరి:—

శ్లో॥ మానుష్యం వరవంశజన్మ విభవో దీర్ఘాయురారోగ్యత, సన్మిత్రం సుసుతః సతీప్రియతమభక్తాశ్చనారాయణే, విద్వత్వం సుజనత్వం ఇంద్రియజయః సత్పాత్రదానేనతిః, తేపుణ్యేనవినాత్రయో దశ గుణాః సంసారినాం దుర్లభా॥' అనునట్లు,మనుజులకు (1) మాను

షజన్మము (2) సద్వంశమునందు జననము, (3) ఐశ్వర్యము (4) దీర్ఘాయువు (5) ఆరోగ్యము (6) సత్సాంగత్యము (7) సత్సంతానము (౮) అతిప్రియమైనకళత్రము (9) భగవద్భక్తి (10) విద్వత్వము (11) సుజనత్వము (12) జితేంద్రియత్వము (13) సత్పాత్రదానము, అనునీపదమూడు సుగుణములును గలిగి యుండవలయునని యున్నది. ఈగుణములన్నియును సంసారమునందున్నవారికి గలిగియుండుట దుర్లభము. సంసారమునకుమూలమైనభార్యయేమాత్రముఅప్రియమైన దైనను అనర్థకారణమగుట వలననే పైశ్లోకమున అతి ప్రియమైన కళత్రమని చెప్పబడినది. కావుననే సీతాకళ్యాణసమయమున జనకచక్రవర్తి "శ్లో॥ ఇయంసీతా, మమసుతా, సహధర్మచరీ"××× యని సీతాదేవియొక్క సకలసద్గుణ మహిమయంతయును మొట్టమొదట మూడుమాటలలో నన్వయించునట్లుచెప్పెను. అనగా, 'ఇయంసీతా' అయోనిసంభవురాలైనట్టియును భూదేవిగర్భమునందుబుట్టినట్టియును యీసీత; 'మమసుతా' శ్రేష్ఠమగురాజవంశమునందు బుట్టినచక్రవర్తియగునాబిడ్డవలె నాచేపెంచబడినది; 'సహధర్మచరీ' = నీమనస్సుననుసరించి నీవెట్టిధర్మమునుచేయుదువో అట్టిధర్మమును చేయుచు నీకనుకూలముగ ప్రవర్తించునది,యనిచెప్పెను. పైనచెప్పినసద్గుణములతోనుండునట్టి భార్యను గలిగియున్న దుష్కర్మలచేయుట కెట్లవకాశముగలుగును. చెడు కార్యములు చేయునప్పుడే చక్కగ నాలోచించి తెలిసికొని వాటినిచేయక నివర్తించి సత్కార్యములయందు బుద్ధిని ప్రయోగించను ప్రయత్నపడవలయును. సాధారణముగ వుదర నిమిత్త మెంతో పాటుపడవలసియుండగా బ్రహ్మవిద్యలభించుటకెంత పాటుపడవలసి యుండును. ఫలమును బొందుట

కు పాటుపడవలసియే యున్నది. '*Once or twice though yon may fail, try, try try, again*'' అనుఆంగ్లేయనీతివాక్యముచొప్పున, వకటిరెండుపర్యాయములుకోరినఫలమును బడయకున్నపదేపదే ప్రయత్నపడవలయును, ఏకాంతముగకూర్చుని అసత్పదార్థము లివియని యాలోచించి వాటియందున మనసుబోనియ్యక త్రుంచివైచి సంసారబంధ విముక్తికై ప్రయత్నపడవలయును. శరీర మనిత్యమని మనస్సున పూర్జితముగ యెవ్వరికెప్పుడు తోచునో అట్టివారలకు అప్పుడేవిచారణ చేయుటకు బుద్ధిపుట్టును.

తిరుమాలైలో శ్రీతొండరడిపొడియాళ్వార్లు ఇట్లుజెప్పిరి.—

"పాశురం॥ నమనుంముగ్గలనుంపేశ, నరగిల్ నిన్నార్గట్ కేట్క...।
నరగమే సువర్గమాగుం..., నామంగళుడైయనమ్బి।
అవనదూరరంగ మెన్నాదయర్ త్తువీళ్న్దళియమాన్దర్।
కవలెయుళ్ పడుకిన్టారెన్టదనుకేక కవర్గిన్టేనే॥''

యని యానతిచ్చిరి అనగా, యమధర్మరాజును ముద్గలమహర్షియును భగవన్నామ ప్రభావమును సంభాషించుచుండగా నరకములోనున్నవారు విని నందున ఆనరకముగూడ స్వర్గసుఖమునిచ్చునట్టిదై యుండగా, అట్టిభగవన్నామమును స్మరియించగల నాలుకగలిగిన నరజన్మము నెత్తినవారు భగవంతుడు అధిష్టించియుండు శ్రీరంగక్షేత్రమువైనను నోటారస్మరియించక సామాన్యవిషయములలో బడి దుఃఖించుచున్నారేయను వ్యసనముతో యానతిచ్చిరి. ఇట్లు బద్ధులు ముక్తులు కావడమునకు వారివారి యంతస్థులకు దగినట్లే పెద్దలు చెప్పియున్నారు, ఆప్రకారము అభ్యాసముచేసిననే మోక్షమునుబొందవచ్చును. తెల్లవారినుంచి సాయంత్రమువరకుపుదరనిమిత్తం పాటుపడుట క్రమముగ తగ్గించి ఆత్మవిచారణచేయవలయును. బహిర్ముఖమునచూచిన కనుపడు పదార్థములన్నియును అనిత్యములని పెద్దలు పదేపదేచెప్పెడిదానిని మనసునందుంచుకొని విచారణచేసియీశరీరమున్ను బాల్యయౌవనాద్యవస్థలున్ను, దారాపుత్రాది సంసారాదులున్ను అందలిసుఖమున్ను మిథ్యయని దెలిసికొని వైరాగ్యము నవలంభించవలయును. అట్టివైరాగ్యమును దృఢముగ గలిగియున్న రామచంద్రుడు యిప్పుడు

**కాలము**:—(అనగా, కాలుడు = యముడు, అనువాని) యొక్క స్వరూపమునుగూర్చి చెప్పుచున్నాడు. కాలము అనగా వేళయనియర్థము, కాలమువచ్చిన, వేళవచ్చిన, యముడువచ్చిన, పోవలసినదేయను లోకవాడు కఅందరకును తెలిసియున్నది. గాన యముడు కాలము వేళ అనుపదముల కర్థమొక్కటియేయైయున్నది. యమునిచేత చిక్కనివారులేరు.

శ్లో॥ క్వచిద్వావిద్యతేమేషాం సంసారేసుఖభావనా ।
ఆఖు స్తంతుమివాశేషం కాలాస్తామపికృంతతి ॥

అజ్ఞానమువలన యెవరికైనను సంసారమునందు యించుక సుఖమున్నదని తోచిన, దానిని, యెలుకదారమును కొరికివేయునట్లు యముడుకత్తరించుచున్నాడు.

శ్లో॥ నతదస్తి హదయదయం కాలస్య కలఘస్మరః ।
గ్రసతేన జగజ్జాతం మహాబ్ధి మివబాడబః ॥

మహాసముద్రమును బడబాగ్ని మ్రింగివేయునట్లు యీప్రపంచమునందు కాలుడను యమునివలన భక్షింపబడనివస్తువ యేదియునులేదు. అనగా, పిపీలికాదిబ్రహ్మ పర్యంతమున్ను యమునకి లోబడి యమునికి యెప్పుడైన నొకప్పుడు శరీరములను అర్పణచేయవలసినదేయని యర్థము.

శ్లో॥ మహతామపినోదేవః పరిపాలయతిక్షణం ।
కాలః కబళితాశేష విశ్వో విశ్వాత్మతాంగతః ॥

ఎటువంటి మహాత్ములనైనను కాలము సమీపించిన తక్షణమే కాలుడు దినివేయును గాని వొకక్షణమైనను తాళజాలడు. ఇట్లు సమస్త ప్రపంచమును కబళించి కాలుడు విశ్వరూపమును పొందియుండును. ఎట్టివారైనను వారిశరీరములను కాలమను యమునికెప్పుడైనను యొకనాటికి వొప్పగించవలసినది సిద్ధమైయున్నది. ఇందుకు దృష్టాంతముగ,

'మనువిరన్దనన్, మాంధాత మాండినన్, వానవార్, కులంవాழ் తనువశైత్తరోర్ ముచుకుందన్, శాయండనన్, దశరథన్, శమిస్తత్తాన్, యని యిరుప్పదాదు, ఇందువుం, రవియుం, వుగుదావిట్టరావణన్, వుని నిదలైరామనాన్ పొందినాన్ తుంజినారనుఱి తూత్తపట్టార్గ్లాల్, యన్జినార్ యార్వుకొన్జిలగత్తినిల్' ఇట్లు మనుచక్రవర్తియును రామచంద్రునికి తండ్రియైన దశరథమహారాజు మొదలయినవారందరున్న ఆప్రకారము కాలునివశమై శరీరములను కాలునికి బలి యిచ్చియుండగా

మనమెంతటివారము. గాన జననమొందిన ప్రతిమనుజుడును చచ్చుట నిశ్చయము. అందరును యొకనాటికి పోవలసినవారేగాని నిలచియుండువారెవరును లేరు. 'శా॥ కారేరాజులు రాజ్యముల్గలుగవే గర్వోన్నతింబొందరే। వారేరీసిరిమూటగట్టికొనిపోవంజాలిరే భూమిపై। బేరైనంగలదే×××'॥యనినట్లు ఎవరున్నుపోవునప్పుడు యేమియును తమతోకూడదీసికొనిపోవుటలేదు.

శ్లో॥ యేరమ్యాయేశుభారంభా స్సుమేరు శురయోపియే।
కాలేనవినిగీర్ణాస్తే గరుడేనేవపన్నగాః॥

ఎట్టిసుందరమైనవారుగాని, పదార్థములుగాని, యెట్టిసత్కర్మలజేయువారుగాని, సత్పదార్థములుగాని, మహాత్మేరువు సమాన గౌరవనీయ్యులుగాని గౌరవనియ్యమగు పదార్థములుగాని, గరుత్మంతునిచే సర్పములను మ్రింగబడువటుల కాలునిచే దిగమ్రింగబడును.

శ్లో॥ తృణంపాంసుం మహేంద్రంచ సుమేరుం పర్ణజీర్ణవం।
ఆత్మం భరితయాసర్వ మాత్మసాత్కర్తుముద్యతః॥

కాలుడు గడ్డిపొరకనుగాని పరాగమునుగాని, మేరుపర్వతమును గాని ప్రల్లాకునుగాని మహేంద్రపర్వతమునుగాని సముద్రమునుగాని సమస్తమైనవాటిని సులభముగ తనకడుపునవేసికొని జీర్ణముచేసికొనను యత్నముచేయును. అనగా, కాలునికి అన్నియును కబళీకరముకావలెనని తాత్పర్యము. గాన, యీవుత్కృష్టమైన మానుషజన్మమునెత్తిన శరీరమును యెప్పుడు కాలుడు దీసికొనిపోవునో, యింతలో పాటుపడి బ్రహ్మజ్ఞానానందమును బొందుమార్గమును దెలిసికొనవలయునే యను బుద్ధిగలిగి భయముతోచిననే భక్తికలుగునుగాని లేకున్న కలుగదు,

శ్లో॥ కాలోయం ఘాతమశక, ఘుంఘుమానాం ప్రపాతినాం।
బ్రహ్మండోదుంబరౌఘానాం బృహత్పాదపతాంగతః॥
పేష్యాహార్విమేషేణ సూర్యాత్మా పావకత్సలం।
లోకపాల ఫలాన్యత్తి జగజ్జీర్ణవనాదయం॥

కాలుడు వుదయమున ప్రపంచమనే అడవినిన్ని అందున పెద్ద అత్తిచెట్టునున్ను సృష్టించి అందున జీవకోటులను దోమలగుంపుల ఘుంఘుమ్మను ధ్వనితోడ ఫలించి రాసులురాసులుగ పడుచున్న బ్రహ్మాండములను అత్తిపండ్లను, పగటియందు సూర్యుడను కంటివలన పక్వమైనవానినిగా చూచి రాత్రికాలమున లోకపాలకులను ఫలములను దీసికొనిపోయి దినుచున్నాడు.

శ్లో॥ జగజ్జీర్ణ ఘటీకేన్తా స్నిక్షిపత్యుగ్రకోటికే ।
క్రమేణగుణవల్లోక మణీన్మృత్యుసముద్గతే ॥

కాలపురుషుడు జగము అను యీ ప్రాతయింటియందు ఆకటి-డకటి-డ నుండు సద్గుణసంపన్నులైనవారిని జేర్చి భయంకరమగు మృత్యువు అను భరణిలోబడవేయుచున్నాడు.

ఇట్లు ప్రారబ్ధకర్మము పూర్ణంతవరకున్ను కాలుడను యమునివలన మృత్యువువాతబడుచు మరల మరల జన్మముల నెత్తుచునేయుండవలయును. సహజముగా యిట్లు జన్మములెత్తుచువచ్చిన వకప్పుడు కర్మము పూర్తిగ తీరిపోయి జన్మములెత్తవలసినది లేకపోవునుగదా యనిన, మరల మరల యెత్తుజన్మములలో కర్మముల మూట పెరగకుండా తగ్గించుకొనివచ్చిన గగా అట్లు జన్మాంతరహితమగు ననుకొనవచ్చును, ప్రతిజన్మమునందును కర్మములజేర్చుచు పాపముల మూటను పెంచుచువచ్చినయెడల జన్మముల కు అంత్యమెకటి-డిది.

శ్లో॥ గుణైరా పూర్వలేమైవలోకరత్నావలీభృశం ।
భూసార్థమివతామంగే కృత్వా భూయోనికృంతతి ॥

ప్రపంచమందలి రత్నములవంటి గొప్పమనుష్యులను సహితము ప్రకృతిగుణములను దారములో గ్రుచ్చి కాలుడు మాలికగా గ్రుచ్చి మరల త్రెంచివేయుచున్నాడు.

శ్లో॥ అస్యైవాచరతోదీనైర్ముగ్ధమూర్ఖతమ్మృగప్రజైః ।
అఖేటకం జర్జరితైర్జగజ్జాలంగలజాలకే ॥

శ్లో॥ ఏశదేశోలపచ్చారు బడబానలపంకజా ।
క్రీడాపుష్కరణీరమ్యా కల్పకాలమహార్ణవః ॥

కాలుడు, జగమను మహారణ్యమునందు దైన్యమువలనను మూఢబుద్ధి వలనను, చెదరిపోయినట్టి భూతకోటులు అనుమృగాదులను వేటాడికల్పాంతమారం దగు మహాసముద్రమును బడబాగ్నియను వికసించిన కమలముగల సంస్నగా జేసికొని క్రీడించుచుండును.

శ్లో॥ కటుతిక్తామ్లభూతాద్యైస్సదధిక్షీరసాగరైః ।
త్మైరేవమైః పర్యుషితైర్జగద్భిః కల్యవర్తనం ॥

ఈకాలుడను యమునికి జగములు ప్రాతఃకాలభోజనముగను, భూతకోట్లు కారము చేదు పులుసు అను షడ్రసవ్యంజనములుగను, క్షీరసాగ

రము మొదలయిన సప్తసముద్రములును, పానీయ్యముగను అగు చున్నవి.

ఇటువంటి కాలునివద్ద దగులుకొని తగనిబాధల పడవలసియున్న దేయను భయముగలిగి జీవన్ముక్తిమార్గమును కష్టపడి తెలిసికొనవలయును. బరువైన మూటమోసికొనిపోవుచున్న బీదవాడొకడు మోయలేక దుఃఖించుచు నొక బరువుని దిన్నెపై మూటనుంచి, అయ్యో! నేనీకష్టమును భరించలేనే యముడైనను వచ్చి నన్నుదీసుకపోయిన సుఖపడుదునేయని యనుకొనెను. అంతట యముడు ప్రత్యక్షమై రమ్మని పిలువగా, భ్రమపడి నేమూరక చెప్పితినేగాని నేనిప్పుడు రానననెను. అట్లు అజ్ఞానులగువారు కష్టకాలమునందు కాలుడువచ్చి శీఘ్రముగ దీసికొనిపోయిన బాగుండుననుకొనుచుండి తుదకు కాలుడువచ్చి దీసికొనిపోవునప్పుడు అయ్యో అన్నియును వదలిపోవలయునే అని దుఃఖించుదురు. జ్ఞానముగలవారట్లు దుఃఖించవలసియుండదు.

మోక్షమును గోరి యందుకై ప్రయత్నపడువారికి మొదట కష్టముగనే దోచును వెనుక సుఖము గలుగును. స్త్రీవిషయాదులు మొదటసుఖముగదోచును వెనుక తగని దుఃఖములను గలుగజేయును, శ్రీరామకృష్ణ పరమహంసగారు నీతివాక్యములలో చెప్పినట్లు, *'It is very pleasant to scratch a ring worm but its after experience will be painful and intolerable (vide'gospel of SriRramakrishna Paramahamsa )* తామఱ యను చర్మరోగమును రక్తమువచ్చునట్టుల గోళ్లతోగీరునపుడు మహానందముగనుండును పిదప కొంతసేపటికి అత్యంతమైనట్టియును భరించగూడనట్టియునబాధగలుగును. అట్లే లోకులలో సంసారాది బంధములలో దగులుకొనువారికి అప్పుడు సుఖముగనేదోచును వెనుక పలుదుఃఖములపాలగుదురు. మోక్షమార్గమునకు ప్రయత్నపడుటకు మొదట పలువిధములైన ప్రతిబంధకములున్నట్లును కష్టముగను దోచును. వాటినన్నిటిని నిగ్రహించి దృఢచిత్తముతో పాటుపడిన బ్రహ్మానందపదవిని బొందవచ్చును. ఇట్లు వివేకమువలన చక్కగ విచారించి సాధుసేవ, సాధు సాంగత్యముచేసి, సాధువుగావలయును. సాధువైయున్న యన్నియును సాధించవచ్చును.

ఓమ్.

జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము




(పదునైదవసంచిక PART III)

ఉ

(పదునారవ సంచిక PART I)





ఇది,

శ్రీమాన్, బ్రహ్మశ్రీ రెంగుభూరు

పండిత శ్రీనివాస భాగవత స్వాములవారిచే

నుపన్యసింపబడి

శ్రీయుత సి. యస్. రావుగారిచే వ్రాయబడి

మద్రాస్

శ్రీలక్ష్మీనృసింహ విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడియె.

6-11-14.

COPIES AVAILABLE AT Y - GOVINDARAJULU CHETTY.
NO. 19, STROTTEN MOOTHIA MUDALY STREET: MADRAS.

మృకండమునియును మితిలేని శోకమును పొందుచుండినది తెలిసికొని మార్కండేయుడు అంతబాల్యముననే శివదీక్షాపరుడై యుండి తనకు పదియారేండ్ల ప్రాయమగునంతకు యముడురాగా ఆను శివలింగమును గాఢాలింగనము చేసికొని చంద్రశేఖరుని ఆశ్రయించియున్న నన్ను యముడేమిచేయగలడను వైరాగ్యముతో మార్కండేయుడిట్లు స్తోత్రముచేసెను:—

'రత్నసానుశరాసనం రజ - తాద్రిశృంగనికేతనం,
శింజనీకృతపన్నగేశ్వర - మచ్యుతానల సాయకమ్।
క్షిప్రదగ్ధపురత్రయం త్రిది - వాలయైరభివందితం,
చంద్రశేఖరమాశ్రయేమమ - కింకరిష్యతి వై యమః॥
'పంచపాదపపుష్పగంధిప - దాంబుజద్వయశోభితం,
ఫాలలోచనజాతపావక - దగ్ధమన్మథవిగ్రహమ్।
భస్మదిగ్ధకళేబరం భవ - నాశనం భవమవ్యయం,
చంద్రశేఖరమాశ్రయేమమ - కింకరిష్యతి వై యమః॥
'మత్తవారణముఖ్యచర్మ - కృతోత్తరీయమనోహరం,
పంకజాసనపద్మలోచన - పూజితాంఘ్రిసరోరుహమ్।
దేవసింధుతరంగశీకర - సిక్తసీతజటాధరం,
చంద్రశేఖరమాశ్రయేమమ - కింకరిష్యతి వై యమః॥
'కుండలీకృతకుండలేశ్వర - కుండలం వృషవాహనం,
నారదాదిమునీశ్వరస్తుత - వైభవం భువనేశ్వరమ్।
అంధకాంతకమాశ్రితామర - పాదపం శమనాంతకం,
చంద్రశేఖరమాశ్రయేమమ - కింకరిష్యతి వై యమః॥
'యక్షరాజసఖం భగాక్షహ - రం భుజంగవిభూషణం,
శైలరాజసుతాపరిష్కృత - చారువామకళేబరం।
క్ష్వేళనీలగళం పరశ్వధ - ధారిణం మృగధారిణం,
చంద్రశేఖరమాశ్రయేమమ - కింకరిష్యతి వై యమః॥
'భేషజం భవరోగిణామఖి - లాపదామపహారిణం,
దక్షయజ్ఞవినాశనం త్రిగు - ణాత్మకం త్రివిలోచనం।
భుక్తిముక్తిఫలప్రదం సక - లాఘసంఘనిబర్హణం,
చంద్రశేఖర మాశ్రయేమమ - కింకరిష్యతి వై యమః॥

శ్రీ.

జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము

(పదమూడవ సంచిక ౨వ భాగము.)

**PART II**








ఇది

శ్రీమాన్, బ్రహ్మశ్రీ బెంగుళూరు

పండిత శ్రీనివాస భాగవత స్వాములవారిచే

నుపన్యసింపబడి

శ్రీయుత సి. యన్. రావుగారిచే వ్రాయబడి

మద్రాస్

శ్రీలక్ష్మీ నృసింహ విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడెను.

6-10-14.

COPIES AVAILABLE AT Y - GOVINDARAJULU CHETTY:
NO. 19, STROTTEN MOOTHIA MUDALY STREET: MADRAS.

( పదమూడవ సంచికానుబంధము. )

గావుననే రామచంద్రుడు యిట్టి సమస్తదోష సంపుటమైనట్టియును, యెడతెగని దుఃఖకారిణియైనట్టియును స్త్రీలపై భ్రాంతి తగదని చెప్ప మర లనిట్లనెను.

శ్లో॥ ఇతోమాంస మితోరక్త మితోస్థి నీతివాసరైః ।
బ్రహ్మన్ కతిపయైరేవ యాతిస్త్రీ విశరారుతాం ॥

ఇట్లు మాంసము రక్తముయెముకలుగల స్త్రీశరీరావయవములనువొకటొకటిగ చక్కగ విచారించి చూచిన స్త్రీలయెడల చింతసీఘ్రముగ వదలిపోవునని చెప్పెను. ఇట్లు యేమోహమ్మదని యెల్లకాలము భ్రమసియుండక చక్కగ చింతనజేసి స్త్రీలపై వ్యామోహము వదలవలయును.

శ్లో॥ యస్యస్త్రీ తస్య భోగేచ్ఛా నిస్త్రీ కస్య క్వభోగభూః ।
స్త్రీయం త్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వాసుఖీభవేత్॥

ఎవనికి స్త్రీవుండునో వానికిభోగమునందు వాంఛవుండును స్త్రీలేకున్న వాంఛలేదు. స్త్రీని విడచినవాడు జగమును విడచినవాడగును, జగమునువిడచెనేని సుఖాంతుడగును.

ఇందుకే తొండరడిప్పొడి యాళ్వార్లు తిరుమాలై ౧౬వ పాశురములో

శూధనార్ కళ్ళ్వనాగి త్తూర్ త్తగోడి శ్వేస్ కాలమ్।
మాదరార్ కయఱ్కణెన్నుంవలైయుళ్ పట్టఴున్దువేనై ।
పోదరేయెన్రు శొల్లి పున్దియుళ్ పుగున్దు తన్పాల్
ఆదరం పెరుగవైత్త వళగనూర రజ్గమన్రే ॥

వంచకుడనై యీశ్వరుని సొత్తగు ఆత్మను నాదియని విషయాంతర పరులతోగూడి స్త్రీలవలలోదగిలి మునిగియున్న నన్ను కనికరించి చేరదీసి తన దర్శనమిచ్చి నాభక్తిని యభివృద్ధినొందించిన భగవంతు నిది శ్రీరంగదివ్యక్షేత్రముగదా యని యానందించిరి. మరియు ౩౩ వ పాశురములో,

'మెయ్యెల్లాంపోగవిట్టు విరిగుళలారిల్ పట్టు
పొయ్యెల్లాం పొదిన్దుకొణ్డ పోఴుకనేన్-వన్దునిన్రేన్ xxx'

సత్యమనునది యేమాత్రములేక స్త్రీలకులోబడి లజ్జలేక యిపుడు నీసన్నిధికివచ్చి, నాయందెన్నిదోషములుండినను నేనెంత అనర్హుడనైనను

రక్షించుదువను ఆశతోడ నిలచియున్నానని శ్రీరంగనాథునితో మొరబెట్టుకొనిరి. ఇట్లే తిరుమంగై ఆళ్వారును గూడ,

శాన్రేను మెఙ్ ముత్తైయార్ తెడఙ్ బోఙ్ పుణరిఙ్ బవెళ్ళత్తుళ్ xxx యనుపాశురములో, స్త్రీవిషయాదులయందు మిక్కిలి భ్రమతో కాలమంతయునుగడపి నిన్నుమరచియుండిన నన్నుపురక్షింపుమని ప్రార్థించిరి.

ఇట్లు అనేకపెద్దలు అనుభవమువలన స్త్రీవిషయాదుల యందు విరక్తికలిగి భగవంతుని ప్రార్థించవలయునని చెప్పియుండగా గమనించక 'మాతృవత్ పరదారాణి పరద్రవ్యాణిలోష్టవత్ । ఆత్మవత్ సర్వభూతాని, యఃపశ్యతిసపశ్యతి' - పరస్త్రీని తల్లివలెను, పరద్రవ్యమును తృణము వలెను; అన్నియాత్మలను తనయాత్మవంటిదేయని యున్న ధర్మమార్గమును అనుసరించక నరకహేతువులగు పాపకార్యములను చేయుచునేయున్నారు. 'శ్లో॥ జానామిధర్మం నచమేప్రవృత్తిః । జానామ్యధర్మం నచమే నివృత్తిః' యనునట్లు ధర్మాధర్మవచనములెన్నైనను నోటితో చెప్పవచ్చునుగాని ఆచరించుట బహుకష్టము. అన్నిధర్మములు తెలిసిన ఋషులు గూడ స్త్రీలవలలలో చిక్కుకొనిరని యిదివరకే చెప్పబడినది. లక్ష్మణ పెరుమాళ్లవలెయుండవలయును. శ్రీరాములవారు సీతగోరిన మాయామృగమునకైపోయి బాణమువేసినంతట యామృగమరచిన శబ్దమును వినిన సీత రామునకేదైన యాపదగలిగినదేమో చూచిరమ్మని పంపగా పోయిన లక్ష్మణునిజూచి, నేను సీతనెడబాసివచ్చినందున సీతముఖమేమైన చిన్నబోయియున్నదాయని రాములవారడిగినందుకు లక్ష్మణుడిట్లు చెప్పెను.

శ్లో॥ నాహంజానామి కేయూరే, నాహంజానామికుండలే ।
నూపురేత్వభిజానామి, నిత్యంపాదాబ్జవందనాత్ ॥

'పితృస్సమానః జ్యేష్ఠా' యని మిమ్మున తండ్రివలెను ఆమెను తల్లివలెను భావించి, ప్రతిదినమున్ను నేను ఆమె పాదములకు నమస్కారము చేయడము వలన కాలియందెలు మాత్రముజూచుచున్నానేగాని, యామె ముఖకుండలాదులు యేదియు నేను నెరుగనని చెప్పెను. ఇదిగదా పుణ్యావశము అట్లుగదా ధర్మమును తెలిసికొని మనస్సా అనుష్ఠించవలయును. ఆప్రకారము యుండక స్త్రీవిషయాదులలోబడి వ్యర్థముగ ప్రాణవిత్తమానములను పోగొట్టుకొని భ్రష్టులగుచున్నారే, అట్టివారికి శ్రీసూక్తిత్వమునచ్చినట్లని యొకమహానుభావుడు చమత్కారముగ చెప్పెను. అనగా,

సంసారం అనగా, పతివ్రతయగు భార్యయుంతేనట్లయినమితమైన అభిమానమునువుంచి కాపాడవలయునేగాని భార్యయందుగాని పరస్త్రీయందుగాని లోలుడై అందుకొరకు ద్రవ్యాపేక్షాద కష్టములలోబడియుండుటగాదు. పతివ్రతలైన స్త్రీయును అట్లే పతియేదైవమనియెంచి పతికి యేవిధకష్టమును దెచ్చిపెట్టక అతని ఆత్మసుఖానందమార్గమునకు అనుకూలముగనుండవలయును.

శ్లో॥ మృషాన్నదాతా తరుణాగ్నిహోత్రీ వేదాంతవిచ్చంద్రసహస్రజీవి
మాసోప వాసీచ పతివ్రతాచ షడ్జీవలోకే మమవందనీయా॥

అన్నదాతలును అగ్నిహోత్రముచేయువారును వేదాంత విచారము చేయువారును చంద్రదర్శనములను చేసినవారును మాసోపవాసులును, పతివ్రతలును, యీఆర్గురును పూజనీయులని గరుడపురాణములో నున్నది. గాన పతివ్రతల కందరు నమస్కారముచేయదగును. పురుషుడు గలస్త్రీకి వేరే దేవుడులేదు. పురుషుడే దేవుడు పురుషుడు గ్రుడ్డి కుంటి మూగ బీద వాడైనను యెట్టివాడైనను పతియే దైవమనియెంచి,

శ్లో॥ కోకిలానాంస్వరోరూపం స్త్రీణాంరూపం పతివ్రతం!
విద్యారూపం కురూపాణాం శమారూపం తపస్వినాం॥

కోకిలపక్షులకు కంఠస్వరమే రూపము, స్త్రీలకు పాతివ్రత్యమే రూపము, కురూపులకు విద్యయే రూపము, ఋషులకు శాంతమే రూపము, గాన స్త్రీలకు ప తి యే దై వ మ ను వ్ర త ము న కు మించిన రూప లావణ్యమును అలంకారములును లేవుగావున మ ం చి ప తి వ్ర త లు పసుపు కుంకుమతోను కంఠ (మంగళ) సూత్రముతోను తృప్తిజెంది సత్ప్రవర్తనగలిగియుండువారలే పతివ్రతలు. ఇట్టిపతివ్రతలకు భగవంతుడు తానేవచ్చి యనుగ్రహించును. వైకుంఠము వారి అరచేతనేయుండును. ప్రపంచమునందిట్టి పతివ్రతయును స్త్రీచాంచల్యములేని పురుషుడును యుండుట యరుదు.

ఈప్రకారము అంతయును అనుభవము వలననే పెద్దలు చెప్పియున్నారు. భాగవతము మోక్షగ్రంథము అని యనుటకు కారణమేమనగా, చిలుకకొరికినపండు రుచికరమైనదని లోకమునందెంత యనుభవసిద్ధమో యట్లు శుకబ్రహ్మమను చిలుకయొక్క అనుభవమున చెప్పబడిన యీభాగవతము అను పండు రుచికరమైన మోక్షగ్రంథమైనది.

ఒకానొక రాజు తనయొద్దనుండు పండితునివలన భాగవత శ్రవణము చేసి పరీక్షిన్మహారాజు యేడుదినములలో ముక్తినొందినట్లు చెప్పియుండగా, యెన్నిసంవత్సరములుగ వినుచున్న నాకేల ముక్తికలుగ లేదని యడిగెను. అందుకు బదులుచెప్పుటకు పండితునకు తోచక యింటికిపోయి చింతించుచుండగా ఆయన కుమార్తె విచారించుచు రాజుగారికి బదులను తాను వచ్చి చెప్పెదనని తండ్రిని తీసికొనిపోయి రాజుచేతులను కొంతసేపు వెనుకకు త్రిప్పి కట్టవేసికొనునట్లు ప్రార్థించి యొకస్తంభమున కలకండనుంచి నోటిదగ్గర రాజును తినుమని చెప్పెను. నాచేతులను కట్టియుండగా నేనెట్లు భక్షింతును అనెను. అంతట ఆమె కట్టునుసడలించిన తక్షణమున యారాజు కలకండను తిని సంతసించి, నాప్రశ్నకు బదులుచెప్పుమని యడిగెను. అందుకామె యిట్లు చెప్పెను. రాజా, నేను నీచేతులను కట్టియుండగా, నీవెట్లు కలకండను నోటిదగ్గరయుంచినను తినలేకపోతివో అట్లే నీమనస్సు లౌకికవ్యవహారములయందు కట్టుబడియుండగా మోక్షమెట్లుకలుగును. నీచేతికట్టువదలించిన నీవెట్లు కలకండనుతిని యానందము ననుభవించితివో, అట్లే నివ్వున్న లోకముతో చిక్కి కట్టియున్న నీమనస్సుయొక్క కట్టును వదలించుకొనిన తక్షణమే మోక్షానందమును బొందగగలవుగాని పూర్తిగ భాగవతము నెంతకాలము వినినను ముక్తికలుగదనిచెప్పెను. ఇట్టివారికి పూర్తిగ హేయమైన స్త్రీలయందలి చపలమును వదలవలయునను గౌరవముగ చెప్పిన గ్రహింతురా? ఇంత వస్త్రరంజితములగు అవయవములుగల స్త్రీలను యేల హేయమనవలెనని దోచునుగాన గూఢార్థములనుమాని వాటిగుట్టంతయును బైటబెట్టి రక్తమాంస నరశల్య మలమూత్రాది మయమైనవని బుద్ధికిబట్టునట్లు తగుమయిన దృష్టాంతములతో యెత్తియెత్తి కత్తెరతో కత్తిరించినటుల చెప్పనే నెత్తికెక్కి గట్టిగనుండు వృర్థగడ్డను యుడికించి మెత్తనచేసినట్లు, వివేకమును అగ్నివలన ఆశనుకాల్చి మనస్సును శాంతపరచి వ్యర్థగడ్డను పారద్రోయుచుపోగా లోపల యేమియు లేనట్లు వాకట్టుకట్టిగ శోధించి బహిర్ముఖవ్యాపారములవల్ల యేమియును ప్రయోజనములేదులేదని తెలిసికొని శ్రవణ మననాదులు శ్రద్ధతో జేసి వైరాగ్యమును తెచ్చికొందురు. అన్నిటికిని ముందు నమ్మకము దృఢముగనుండవలయును.

ఒకచోట యిద్దరు తపసుచేయుచుండగా వారివద్దకు నారదమహా ర్షి వచ్చిన పూజించి కైలాసమునందు శివుడేమిచేయుచున్నాడని వారిరు వురును అడుగగా, సూదిద్వారముగుండా యేనుగలు కొండలు జగత్తు యావత్తు యిటుదూర్చి యీటుదీయుచున్నాడని నారదుడు చెప్పగా ఆయి రువురలలో యొకడు యిది యెట్టిమాటయని నమ్మక పరిహాసించెను, మరి యొకడు పరమేశ్వరున కట్టి శక్తి కలదని నమ్మెను. అట్లు నమ్మినవారికి మోక్షముగలదు. నమ్మక సందేహించువారు చెడి అనేక జన్మములెత్త వలసియుండును.

భద్రాచల రామదాసుగారు దారినబోవుచుండి అధికమైన దప్పికలిగి యొకనూతినిజూచి అక్కడ యెక్కడ యొక చెంబుదొరకనందున మాలవా డొకచెంబుచేతబట్టుకొని బోవుచుండగా పిలచి వానినోట రామరామ రామ యనిమూడుపర్యాయములుచెప్పించి యంతట వాడుపవిత్రుడైనాడనినమ్మి యాచెంబుదీసికొని దప్పిదీర్చికొనెను. ఇట్లునమ్మకముతోగూడిన ధైర్యముగూ డ నుండవలయును. అట్లున్ననే బాగుగయోచించి మననముచేసి నవివేక మును మోక్షమును యీజన్మమునందే కలుగును. ముఖ్యముగ స్త్రీచాప ల్యమును వదలవలసినది అత్యావశ్యకమయిన విషయము. దానిని చక్కగ గమనించవలయును. స్త్రీవల్ల యేమి సుఖములేదులేదని తెలిసికొనవల యును. ఈవిషయమై రామలింగస్వాములవారు 'ఒరుమైయుడ నినదు తిరు మలరడినినైక్కిన్ఱ వుత్తమర్ దం వురవువేండుం। వుళ్లొన్ఱు వైత్తు పురం బొన్ఱుపేశువారు రవుకలవామైవేండుం। పెరుమై పెరునినదు పుగళ్ పేశ వేండుం పొయ్మైపేశాదిరుక్కవేండుం। పెరునెరి పిడిత్తొళుగవేండు మద మాన పేయ్పిడియాదిరుక్కవేండుం॥ మరువు పెణ్ణాశై మరక్కవేండుమునై మరవాదిరుక్కవేండుం। మదివేండు నిన్ఱరుళ్ నిదవేండు నోయ్ యత్తవాళ్ వైనావాళ్ వేండుంxxx' అనగా వోర్పుతో భగవంతుని పాదారవిందము లయందు భక్తిగల యుత్తముల సాంగత్యము కావలయును. కుత్సితుల తో గూడకుండవలయును, సదా భగవద్ధ్యానము చేయుచుండవలయును, అబద్ధము లాడకుండవలయును, మహావైరాగ్యము కలుగవలయును మద పిశాచము పట్టకుండవలయును, స్త్రీలపై ఆశను మరచిపోవలయును భగ వంతుని యెల్లప్పుడును మరువకుండవలయును, ఇట్లనుగ్రహించుము అని ప్రార్థించిరి. మహారాజ తొరవు అని యిదివరకే చెప్పబడిన ద్రవిడ గ్రం

క్షణములోన, వైరాగ్యముగలిగి రాజ్యమున్ను మొదలైన వాటినన్నిటిని వదలి యడవికిబోయిన రాజును ఆయనభార్య ఆయనపోవునపు డడ్డపడి నాకు నాయకుడైన నీవిట్లుబోయిన నాకేమిగతియని యడిగినందుకు, నిన్నుడైయు నాకనైసినమల్లైయుడనోక్కి-నిర్క-యూట్టా దున్నుడైయునాయకనెండ్రండె నైయేకడుదినీయుఖ్రవ్వదెన్నే, మిన్నినైయవిడైయాయ్ కేళ్నైవరుకుక్క్నా యకనోర్క్షేలామిశఁ, అన్నవెనైనే తేడిప్పోగిండ్రేనెన వరశర్కరినై కాత్తుం॥ నీనాయకుడు నీహృదయములో నేనున్నాడని తెలిసికొని నీలో నీవు చూచుకొనియుండుము, నీనాయకుడు నేనని యెందుకనుకొనియెదవు, మనకిరువురకును నాయకుడు భగవంతుడుగాన నేనతని వెదకుకొనిపోతు న్నానని, తాత్పర్యము. ఆమహానుభావు డట్టివైరాగ్యముతో వెళ్ళిపోయె ను. నిప్పును అంటితే కాలును స్త్రీయను నిప్పును కంటితో చూచినంతట నే కాల్చునని చెప్పబడియున్నది. కండ్లుచూచిన వాటిని కర్ణములు వినిన వాటిని మనస్సుతో చెప్పనుగాననే 'కణ్ణే కాదే కండను కేట్టదు శొల్లాదె' అనగా ఓకన్నా చెవ్వా, కన్నది విన్నది చెప్పకుమా, యనియందురు. స్త్రీ ని కనులతోచూచి మనసున దలచినంతమాత్రమున పురుషులు రౌరవాదినర కమున బడుదురు. పెద్దలైనవారందువలననే అన్నిదుర్గుణములకు కారణ మైన పంచేంద్రియవ్యాపారములను కట్టిపెట్టుటకై సంచారముచేయక యొకయేకాంతస్థలమున నుందురు. అట్లున్న కంటితోచూచుటయును మన స్సాతలచుటయును తటస్థించదు. పురుషులవలెనే స్త్రీలనుగూడ గమనించి సద్బుద్ధిని దెచ్చుకొనవలయును. స్త్రీలున్ను పురుషులనుచూచి భ్రమించ రాదు. స్త్రీపురుషులిరువురును అట్లున్ననే ధర్మమునకు యేలోపమును గలుగకుండును. అట్టివారికి భగవంతుడు ప్రత్యక్షమగును. లేకున్న వాను కకుసిచ్చ గుర్రపుబండి సామెతయగును. ఇందుకొక దృష్టాంతము.

శ్లో॥ గృహిణీ స్వజనంవక్తి శుష్కాహారం మితాశనం।
పతిభక్త్యాంస్తుభర్త్స్వకాః క్షీరపాకతస్కరాసపి॥ యన్నట్లు తన

వారువచ్చి భుజించిన వారివలన కష్టమేమియును దోచలేదని సంతసించి, తనభర్తకు కావలసినవారు వచ్చిభుజించినవారివలన కలనష్టకష్టములుసం భవించినవని వ్యసనపడునట్టి స్త్రీలు పతివ్రతలుగారని పెద్దలు చెప్పియు న్నారు, ఇట్లు చెప్పడమువలన స్త్రీలను దూషించుటగాదు. ఈవిషయము లన్నియును పెద్దలైనవారు వారియనుభవముపైని చెప్పియున్నారు. వాటిని

యెన్ని చెప్పినను స్వానుభవము లేకపోయిన బూడిదలో యాహుతి చేసి నట్లు మనస్సునకు పట్టదు. బర్తృహరి వైరాగ్యశతకములో

శ్లో॥ తుఙ్గంవేశ్మసుతాః సతా మభిమతాః సఙ్ఖ్యాతిగాః సంపదః ।
కల్యాణీ దయితా వయశ్చ నవమి త్యజ్ఞానమూఢో జనః ।
మత్వావిశ్వ మనశ్వరం నివిశతే సంసారకారాగృహే ।
సందృశ్యక్షణ భఙ్గురంతదఖిలం ధన్యస్తుసన్న్యస్యతి॥

అనగా, మిద్దెలు మేడలు సత్పుత్రులు సంపదలు భార్య యవ్వనము మరియు ప్రపంచమునంతయును నిత్యమని నమ్మి అజ్ఞానియగు మనుజుడు సంసారమునందు దగులుకొనుచున్నాడు. జ్ఞానియను పుణ్యాత్ముడు వాని నెల్ల అనిత్యమని గ్రహించి సన్న్యసించుచున్నాడు, అని చెప్పియున్నారు. ఇట్లన్నియును నీటిబుగ్గవంటిదని తలంచవలయును. అట్లుతలచువారే ధన్యులు. జగత్తున యేమియు లేదు నాటకమువంటి వట్టిబూటకమని తెలిసికొని మొదట స్త్రీచాపల్యమును వదలిపెట్టవలయును. స్త్రీచాపల్యము వదలిన జగత్తును వదలినట్లై జగత్తును వదలిన నిజమైన ఆనందము గలుగును. అన్నిటికని మననము చేయవలయును. లేకున్న సార్థకము లేదు. నిత్యమున్న అభ్యాసము చేయుచు వచ్చిననే మనస్సు కుదురును. మనస్సు కుదిరిననే లోకమును మరచి ఆత్మస్వరూపదర్శనమగును. నిష్ఠకుదరక అన్నియును తెలుసుకొనిన సార్థకము లేదు. ఆత్మస్వరూపదర్శనము గలుగుట సామాన్యము కాదు. కావుననే త్రిలోకములయందును యొక జ్ఞానియుండుట అరుదని పెద్దలు చెప్పియున్నారు. పురందరదాసువారు కీర్తనలో- 'నిత్యనేమ మిల్లాదె, జపతపయాకె । భక్తియిల్లాదె పూజ, బహిరంగయాకె ॥ యని చెప్పినట్లు సదా మననము చేయక వైరాగ్యము కలుగక వట్టి జపతపముల వలనను, లోపల నిజమయిన భక్తిలేక జేయునట్టి పూజలవలన యేమియును ప్రయోజనము లేదు. గాన పెద్దలు చెప్పినదంతయును నమ్మి ఆప్రకారము నడచుకొనవలయును. ముఖ్యముగ నమ్మకము కలుగవలయును. సందేహములు గలిగిన సార్థకము లేదు. ఇందుకు తర్కములు చేసిన యుపయోగము లేదు. ఇందుకు పురంధరదాసువారు కీర్తనలో 'నంబిదవిభీష ణనిగె రామనాద, నంబాదరావణనిగె యమనాద, నంబిదప్రహ్లాదనిగె హరిగొద, నంబాదిద్ద హిరణ్యప్రాణహరియాద, నంబిదఅక్రూరనిగెబంటనాద, నంబాదిద్ద కంసానిగె కుంటనాద, నంబిద అర్జుననిగెకృష్ణనాద, నంబాదిద్దదుర్యో

దవసీగ దుష్టవారద××× యం చెప్పియున్నారు. ఇట్టి దృష్టాంతములను బట్టిచూచిన 'నమ్మిచెడినవారులేరు. నమ్మక చెడిపోతే పొయ్యేరు' అనునది సత్యమని స్పష్టమగుచున్నది. కావున నమ్మకమును పెట్టి మననముచేసిననే గాని లేకున్న విన్నదంతయును లాటిన్ గ్రీకు అను తెలియని పరభాషల వంటిదై తోచును గాన వినినవిషయములన్నియును వ్యర్థముగాకుండ రామ చంద్రుడీవిషయమై కడపట చెప్పినట్లు పైకి రమణీయమై కనుపించుచు తప్పించుకొన శక్యము గానట్టి చంచలమైన భోగములనాశించక మదగా రోగ మౌదిమవలని భయముచే శాంతిబొంది 'పరమప్రైమి పదం ప్రయత్నాత్' ప్రయత్నపరమపదమును పొందెదను, అనునట్టి వైరాగ్యముతో చక్కగ యోచించి సార్థకమగునట్లు చేసికొనవలయును.



ఓమ్.

జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము

( పదమూడవ సంచిక )

**PART I**







ఇది,

శ్రీమాన్, బ్రహ్మశ్రీ బెంగుళూరు

పండిత శ్రీనివాస భాగవత స్వాములవారిచే

నుపన్యసింపబడి

శ్రీయుత సి. యన్. రావుగారిచే వ్రాయబడి

మద్రాస్

శ్రీలక్ష్మీ నృసింహ విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

2-10-14.

COPIES AVAILABLE AT Y - GOVINDARAJULU CHETTY:

NO, 19, STROTTEN MOOTHIA MUDALY STREET, MADRAS.



ఓం.

శ్రీమాన్, బ్రహ్మశ్రీ, బెంగుళూరు, పండిత, శ్రీనివాస భాగవతస్వాముల వారి జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము.

# వైరాగ్యప్రకరణానుబంధము.

(పదమూడవ సంచిక)

శ్రీయుత, సి. యస్. రావుగారు యిటుల వ్రాసిరి.—

ప్రపంచమునందు జనులు భగవంతుడు వొకడేయను నిజమును తెలియక అనేక పేళ్లతో చెప్పబడునవి యన్నియును వెవ్వేరు దేవుళ్లని తలంచెదరు. పరబ్రహ్మవస్తువు వొకటియే భగవంతుడు. ఆవస్తువునే అనేకపేళ్లతో ఆరాధించుచున్నారు.

శ్లో॥ బ్రహ్మ విష్ణు రుద్ర హుతాశా రవిచంద్రా । ఇంద్రో వాయుర్ యజ్ఞ ఇతథ్థం పరికల్ప్య । ఏకం సంతం యం బహుదాహుర్ మతిభేదాత్ । తంసారర్ధ్వాన్తవినాశం హారిమీడే॥ యని శ్రీశంకరాచార్యులవారు చెప్పినట్లు బ్రహ్మ విష్ణు రుద్రుడు అగ్నిహోత్రుడు సూర్యనారాయణుడు చంద్రుడు ఇంద్రుడు వాయుదేవుడు అను మొదలయిన నామములను వారివారిబుద్ధిభేదములవలనను మతభేదములవలననుసంకల్పించుకొని వారివారి యిష్టదేవతలనునమ్మి ఆయానామస్మరణలచే భజించుచున్నారు. హరి అనగా సంసారాంధకారమును నాశముజేసి ముక్తి నిచ్చు నిజమైన మూర్తి (భగవంతుడు) యొకడే. ఎందరెన్ని నామములతో భజించినను ఆమూర్తియొకటినే భజించునట్లగును. రెండవదిలేదు. జాడ్యముగలవాడు వేడినీళ్లను త్రాగగోరును, మరియొకడు చల్లనినీళ్లను త్రాగగోరును, బుద్ధిభేదమువలన యొకడు వేడిగను మరియొకడు చల్లగను కోరిరేగాని, నీళ్లు అను వస్తువొకటియేగదా. అట్లే వలుగురికి నాలుగువిధములైన వ్యాధులుండిన యొకేవిధమయిన అవుషధము పట్టదుగాన ఆయావ్యాధికి దగిన అవుషధము పట్టునట్లు, వారివారి మనస్సున దోచిన యేనామముతో భజించినను అది ఆభగవంతుడను ఏకవస్తువునకే అన్వ

యించును. ఆనామములు గలవన్నియును అన్ని దేవుళ్ళుగావు. అవన్నియును వొకటియే, భేదమేమియును లేదని శ్రవణమువలన దెలిసికొని మనననిదిధ్యాసములవలన అభేదదర్శనమైననే ఆత్మజ్ఞానముగలిగి ఆనందసుఖమునను భవించవచ్చును. మననముజేయవలయును, మననములేకున్న శ్రీరామకృష్ణపరమహంసగారు చెప్పినట్లు దేవాలయమునకు వెలుపల భేరీమృదంగ భరతనాట్యాది మేళతాళములు మ్రోగుచుండి లోపల దేవుడు లేనట్లు ఆనందముగలుగదు. గాన మననముచేసి అభేదజ్ఞానముకలిగిననే ఆత్మానందసుఖము గలుగును.

మననముచేయగా చేయగా అభేదజ్ఞానము క్రమముగ కలుగును. ఒక్కపర్యాయమే కలుగదు. బోధించడముగూడ వారివారిబుద్ధికి దగినట్లు కొన్నిగబోధించి క్రమముగ వారికి తేవలయును. చెంబడవాడొకడు చేపలుపట్టను సముద్రముమీద తెప్పకొయ్యపై పోవుటకుముందు పండ్లు టెంకాయ కల్లుసారాయి మొదలైనవాటితో సముద్రునిపూజించునపుడు, సమీపమునందున్న బ్రాహ్మణుడొకడువానినిజూచి సముద్రము నెందుకు పూజించెదవు, యీచెంతనుండు దేవాలయములోని దేవునిపూజించరాదా యని యడిగినందుకు ఆచెంబడివాడు అయ్యా! మాకు చేపలనిచ్చి అన్నముపెట్టి కాపాడుకర్త యీసముద్రమేగనుక మాకుదేవుడైన యీసముద్రమునే మేను పూజించవలసినది మాకు వేరే దేవుడులేదని చెప్పెను. స్వామికి సారాయి కల్లు సమర్పించు యాచెంబడివానివంటివానికి అప్పుడు అవసరపడి యొక్కసారియే ఆత్మజ్ఞాన బోధజేసిన అనర్థము సంభవించును, గాన, శుక్రోదయమునుచూపి అరుణోదయమగుకాలమైనదనిన్ని, అరుణోదయమునుచూపి సూర్యోదయమగుకాలమైనదనిన్ని తెలుపునట్లు క్రమక్రమముగా బోధించి చెప్పినట్లయిన మనస్సున చక్కగ గ్రహించి సూర్యోదయమైనట్లు వైరాగ్యముగలిగి సూర్యప్రకాశము పూర్తిగనైనట్లు ఆత్మానందముకలుగును. వైరాగ్యముకుదరక ఆనందముగలుగదు. అందువలననే ముందు రామచంద్రుని కట్టివైరాగ్యముగలిగినదని వాసిష్ఠమునందు చెప్పబడ్డది. వైరాగ్యము కుదరడము కష్టమైనను అందుకు తగిన సాధనమును ప్రయత్నపూర్వకముగ చేయవలయును. కష్టమని వదలగూడదు. దినమునకు అర్ధగంటకాలమైనను యేకాంతస్థళమునగూర్చుని సాంసారికధర్మములను మఱచి యితరచింతలనుమాని మననాభ్యాసము చేయుచుండవలయును.

కొద్దికొద్దిగనే కొండనెక్కవలయును. చిన్నచెట్టె పెద్దదియగును. చిన్న చెట్టును పెట్టునపుడే మృగములుదినిపోవుననియును, బాలురు పెరికివేయుదురనియును, సకాలమున నీళ్లులేకపోవుననయును భయమువలన కాపాడుట కష్టమనిపించును, పెద్దదైనవెనుక కష్టముండదు, ఫలమునిచ్చును. అట్లే మొదట శ్రవణమననాది అభ్యాసముచేయునపుడే కష్టమనిపించును చేయుచురాగారాగా వైరాగ్యముద్భవించి అందుకు సూచకముగ అన్నియును మిధ్యయని దోచి అన్నిటియందును విరక్తిగలిగి తుదకానంద సుఖమును పొందవచ్చును.

అట్లుజేయుటకు ప్రతిబంధకములైన శరీరము ధనము ఆయువు బాల్యము యవ్వనము మొదలైనవాటి స్వభావములను తెలిపి, యవ్వన కౌమార్యములు రెండును వొకక్క స్వభావముగలదియేగాన, యావశలయందు స్త్రీచాపల్యమువలన బుద్ధిచెడుచున్నదనిచెప్పి అట్టిచాపల్యమునుగలిగించు స్త్రీలయొక్క స్వభావమునుగూర్చి రామచంద్రుడు చెప్పబోవుచున్నాడు.

స్త్రీవిషయాదులయందు చాపల్యముండగూడదనియును విరక్తికలుగవలయుననియును బోధించునపుడు యేప్రకారముజెప్పిన అందున బడిచెడి మగ్నులై యున్నవారికి విరక్తిగలుగునో ఆప్రకారము జెప్పవలయునుగాని వేరువిధముగ జెప్పిన ప్రయోజనములేదు. నిజమైనమాటలు చెవులకు యింపుగనుండదు. తొల్లి విభీషణుడు రావణునితో సీతనుడిసికొనిపోయి,శ్రీరామునకిచ్చి శరణాగతిపొందుమని హితోపదేశమునుచేసినది రావణుని చెవులకింపుగ దోచకుండినపుడు శ్లో॥ సులభాః పురుషారాజన్ సతతం ప్రియవాదినః। అప్రియస్యతు పథ్యస్య వక్తా శ్రోతాచదుర్లభః॥ యని జెప్పెను,— అనగా, ప్రియము (మృదువైనముఖస్తుతిమాటలు) చెప్పెడువారు అనేకులుందురుగాని, హితము (కఠినమైన క్షేమకరమగు మాటలు) చెప్పెడువారుండరు యొకవేళ యుండినను వినునట్టివారుండుట దుర్లభము అని జెప్పెను.

పథ్యము చెప్పెడివైద్యుడు యున్ననే వ్యాధినివర్తించును. జ్ఞానమార్గమును బోధించు సద్గురువు దొరుకుట అరుదు. జ్ఞానముకలుగుటకు మూలమైన విరక్తిమార్గమును అజ్ఞానికి బోధించిన, తాగుబోతుకు తాగవద్దనిన యెంతఆయాసము కలుగునో అంత ఆయాసముకలుగును. సన్మార్గమునందభ్యాసములేనివారికి 'అనభ్యాసే విషం శాస్త్రం అజీర్ణేభోజనం

విషం' అనునట్లు, వివేకముగలుగుమాటలను జెప్పినవిరోధముగ దోచును. యొకవేళ వినినను అందున విపరీతార్థములే గల్పించుకొందురు.

ఒకయవివేకపు రాజువద్దకు యిరువురు శాస్త్రవేత్తలుపోయి యాశీర్వదించి, రాజా మీరు సత్కథాశ్రవణమును జేయవలయును, లేకున్న 'యథా రాజా తథా ప్రజా' యనునట్లు పురజనులు పుణ్యమును సంపాదించుకొనజాలరు గాన భారతభాగవత శ్రవణమును జేయవలయునని చెప్పినందుకు రాజుసమ్మతించి, భారతమును అంతఃపురమునందున్న తన రాణికిని, భాగవతమును తనకును వినుపించమనెను. అట్లొకసంవత్సరము విని యొకనాడు రాణినిజూచి, నీవు భారతమును విని యేమిదెలిసికొంటి వని రాజడిగెను. తమరు భాగవతమును విని యేమిదెలిసికొంటిరో చెప్పమని రాణి యడిగిన, కృష్ణునికి పదియారువేల గోపస్త్రీలు యుండిరనీ భాగవతమునందుండగా రాజుగానున్న నాకు అందునసగముసంఖ్యగల స్త్రీలైనను లేరే యనువ్యసనమును పొందియున్నాననెను. అంతట రాణి, భారతమునందు ద్రౌపదికి అయిదుమంది పురుషులుండిరే నాకు తమరు వొకరేయున్నారే మరినలుగురుయుండిన బాగుండుననెను. ఇదియే వారా గ్రంథములను విని గ్రహించినసారము.

ఇట్లే కొందరు వేదాంతశ్రవణమునందునగూడ యేదైన దృష్టాంతములను జెప్పిన వాటిలోని సారాంశములను వదలి నిస్సారములైన పదములను వాక్యములనుమాత్రము పట్టుకొందురు. వైరాగ్యమునుబోధించునప్పుడు సంసారాదులయందు పామరమును స్త్రీచాపల్యమును వదలవలయుననియును, దాని ననుసరించినవిషయములను తేటపడునట్లు చెప్పిన, వాటికి విపరీతార్థములను కల్పించుకొని వినికికొనువారును భయపడువారును కొందరుందురు. కాళిదాసు, వేమన్న, పట్టిత్తుస్వామి, భద్రగిరిస్వామి, మొదలైనపెద్దలందరును మొదట తమకుండిన యట్టిపామరమును, చాపల్యమును వదలి వైరాగ్యము నవలంభించి వారియనుభవమునుబట్టి లోకులకు విరక్తిమార్గమును వివరముగ దెలుపుగ్రంథములనువ్రాసిపెట్టిరి.

చక్కగ నాలోచించి అన్నియును నశ్వరములనియును దేనితో నేమియు సుఖములేదనియును, ఆత్మజ్ఞానము యొకటియేసుఖమునిచ్చునదియనియును, దెలిసికొని యన్నిటిని మనస్సావదలి వాటితో నంటియంటక నుండవలయునని చెప్పుటయేగాని సంసారాదులయందు విరక్తిగలుగవలయుననగా గృ

హావాసము విడిచి వనవాసము చేయుచునుటయును, ఆలుబిడ్డలను అనాదరణజేసి అడవులకు పోవ్మనుటయును గాదని యిదివరకే అనేకపర్యాయములు చెప్పబడినది.[1] 'ఉంగత్తోము వోట్టువాఙ్లు' అని పెద్దలు చెప్పియున్నట్లు,అన్నియును వుండినను వుండవచ్చునుగాని వాటియందుమనస్సునువుంచరాదు. మనస్సుమాత్రము ఆత్మానందసుఖమునందేయుండవలయును.[2]

పాత్రమునందు చమురుపోసి భక్ష్యమును పచనముచేయునప్పుడు మొదటశబ్దముగలిగి భక్ష్యము బాగా పక్వమైనంతటనే యాశబ్దమెట్లుడిగి పోవునో అట్లె వైరాగ్యమునందు మనస్సు పరిపక్వమైనంతట క్రమముగ ప్రపంచవ్యాపారములు తనంతటనే వదలిపోవును. అట్లు వదలిపోవుటకు క్రమముగ సాధకముచేయుచుండవలయును. ఏమియును లేకున్ననులభించకున్నను గలుగు ఆభావే విరక్తినిబొందుట శ్రేష్ఠమయినదిగాదు. సకల సంపదలున్ను కలిగియుండినను గలుగుభావే విరక్తియే మిక్కిలిశ్రేష్ఠమైనది. విరక్తిమార్గమును చెప్పిన చేదుగనేదోచును. మంచిది చేదుగనేయుండును. అయినను చెడ్డవ్యాధికి చేదుమందుయిచ్చిననే శీఘ్రముగ కుదురును. తమకు యిష్టమని తీపుమందుతినిన అనర్థము వచ్చును. తమకుమంచిదని తోచి తమయిష్టముచొప్పున పాండవులు ఆయిదుమందియును యొకద్రౌపదిని వివాహాము చేసుకున్నపుడు, శ్లో॥ కుంకుమ పఙ్కకళఙ్కితదేహా । తుంగపయోధరకంపితహారా । నూపురదివ్యల సట్పదపద్మా । కంనవశీకృతేఘువిరామా॥ అనగా అంతటి అసమాన రూపవతి యైనద్రౌ

---

(1) చ॥ వనమునమన్న నేమి, గృహావాసముజేసిన నేమియాత్మభా ।
వనయున సంగవృత్తియరివర్గ జయంబును, గల్గియుండినన్ ॥
వనమునమన్న నేమి, గృహావాసముచేసిననేమియాత్మభా ।
వనయున సంగవృత్తియరివర్గజయంబును, లేకయుండినన్ ॥
(నారద పురూరవ సంవాదము.)

(2) కీర్తన॥ పెండ్లాము బిడ్డల పెట్టుకో కావలసియుంటే
యిండ్లను మరిరెండు కట్టుకో ॥
పెండ్లాముబిడ్డల యీకండ్లచూచుకొని శబరి,
పండ్లుతిన్నావానిమనః కండ్లాచూచుకొనవే మనసా॥
( పెద్దల చాటుకీర్తన )

పది శరీరము యెట్టివారినైనను వశపరచుకొనునుగాన వారైదుగురిలో కలహములుగలిగి యనర్థమగునేమోనని తలచి నారదమహర్షి వారివద్దకు బోయి ధర్మరాజునుజూచి, యొకేభార్యను సుందోపసుందులను యిద్దరు వివాహముచేసికొనినందున జగడమాడి చెడిరను కథను సూచనగజెప్పి, వారైదుగురిలో యొకరొకరికి యొక్కొక్క సంవత్సరము వశవర్తినియై యుండవలయునని నియమించెను. ఆకార్యమునకా నియమము పథ్యము పంటిదియై పరిణమించినది.

లోకమునందు వివేకమును విరక్తియును సాధారణముగ కలుగదు. దేనిదేనియందు విరక్తికలుగుట కష్టమో ఆయావస్తువుయొక్క వాస్తవమైన స్థితిని చక్కగ తెలిసికొనిననే అట్టివిరక్తి సీఘ్రముగ మనస్సుకలుగును. కావుననే రామచంద్రుడు పురుషులకు కామవికారమునుకల్గజేయు, స్త్రీలు.— అనువారి శరీరస్వభావమునుగూర్చి యిట్లు చెప్పెను.

శ్లో॥ మాంస పాంచాలికాయాస్తు యంత్రలో లేంగపంజరే ।
స్నాయ్వస్థి గ్రంథశాలిన్యాః స్త్రియాః కి మివశోభనం॥

ఎముకలు, నరములు, మాంసపు కదుములతోనిండి, యంత్రపుబొమ్మ వలెదిరుగుచున్న స్త్రీ శరీరమను గూటియందేమి సుఖమున్నది,

శ్లో॥ త్వఙ్మాంసరక్త భాష్పాంబు పృథక్కృత్వావిలోచనం ।
సమాలోకయరమ్యంచే, త్కింముధాపరిముహ్యసి ॥

నేత్రములయందు మాంసము నెత్తురు వేడినీరు వీటిని వేరువేరుగ జేసి చూచినట్లయిన వాటియందును సుఖముకనుపడదు,

శ్లో॥ మేరుశృంగ తటోల్లాసి, గంగాజలరయోపమా ।
దృష్టాయస్మిం స్తనే, ముక్తాహారస్యోల్లాసశాలితా ॥

శ్లో॥ శ్మశానేషు దిగంతేషు, సయేవలలనా స్తనః ।
శ్వభిరాస్వాద్యతేకాలే, లఘుపిండయివాంధసః ॥

మేరుపర్వతముపైనుండి ప్రవహించు గంగానది కాంతివలె శోభించు ముత్యాలహారాదుల యలంకారముతోనుండు స్త్రీలయొక్క స్తనములను మరణాంతమునందు స్మశానమునందు పెద్దపిండములను గంగలో గలిపి గట్టునపెట్టిన చిన్నపిండములను దినునట్లు కుక్కలు మొదలైన జంతువుల చే జెలకి తినబడుచున్నవి. స్త్రీలయొక్క స్తనములె మొదటపురుషులను మోసపుచ్చి విషయాదులకు వారి మనస్సును ఆకర్షించుచున్నది.

శ్లో॥ యుక్తంకింతవశర్వరీశముఖ మద్వేణీసమాకర్షణం ।
రిధ్యాయాంవహారతత్కథం తవకుచద్వంద్వం మదీయ్యంమనః ।
వ్యత్యస్తం విధిసిక్షితం ననుమమా ప్రాణేశయుక్తంవదా ।
వక్షోజాంబరకర్షణోద్యతకరః కృష్ణస్యభిస్త్రాతునః ॥

అనగా, నాజడనుబట్టి యీడ్చుట న్యాయమాయని గోపికయడిగినం దుకు నీస్తనములు నామనస్సునుబట్టి యీడ్చినందునసే నిట్లుజేసితినని కృష్ణు డు చెప్పినందుకు, నీవు ధర్మపరిపాలనజేయువాడవై యుండి అపరాధము జేసిన వాటినిబట్టి మర్దించక నిరపరాధియైన జడనుబట్టీడ్చుట న్యాయమా యని గోపిక యడిగినట్లు కర్ణామృతమునందున్నది. శ్రీశంకరాచార్య స్వాములవారుగూడ 'శ్లో॥ నారీస్తనభరనాభీదేశం దృష్ట్వామాగా మో హావేశం యేతన్మాంస వసాదివికారం మనసివిచింతయ వారం వారం॥' స్త్రీలయొక్క స్తనాద్యవయవములను చూచినంతమాత్రముననే కామవికా రముగలుగునుగాన మనస్సున తలంచనేవలదు వలదు. అని చెప్పియున్నా రు. కావున అట్లు పసలేనిపిండమువంటిదనియును మనస్సును మోసపుచ్చి చెడుపునదియనియును యోచించి దానియందలి మోహమును వదలిపెట్ట వలయును.

శ్లో॥ కేశకజ్జలధారిణ్యో దుస్పర్శా లోచనప్రియాః ।
దుష్కృతాగ్నిశిఖా నార్యోదహంతితృణవన్నరాన్ ॥

పాపమను అగ్నిస్వరూపులైన స్త్రీలు పురుషులను తమవల్లని తెలవెం డ్రుకలుఅను అంధకారమునందుబడవైచి కన్నులతోకాల్చిశరీరజ్వాలలతో గడ్డిపోచవలె మాడ్చివేయుదురు.

శ్లో॥ జ్వలతామతిదూరేపి సరసా అపినీరసాః ।
స్త్రియోహినరకాగ్నినా మింధనంచారుదారుణం ॥

రసముగలవారుగ గనుపించు స్త్రీలు వారినియనుభవించువారిని నరక మునందు కాల్చుటకై రసములేని యెండినకట్టెలై పరిణమించుదురని తా॥

శ్లో॥ కామనామ్నాకిరాతేన వికీర్ణాముగ్ధచేతసాం ।
నార్యోనరవిహంగానా మంగబంధనవాగురాః ॥

పక్షులను పట్టుటకు వేటకాడు వేయునట్లు, స్త్రీలు మూఢజనులను మోసపుచ్చుటకు మన్మథుడు వేయువలలని తాత్పర్యము. ఈమర్మమును తెలిసికొని మెలగువారే ధన్యులు. మరియును,

౧౯॥ జన్మపల్వలమత్స్యానాం చిత్తకర్దమచారిణాం।
పుంసాందుర్వాసనారజ్జా నారీబడిశపిండికా ॥

జననమరణములనుకొలనుయందు, మనస్సనుబురదలో దిరుగుచున్న పురుషులను చేపలు, ప్రారబ్ధమును త్రాటియందున్న స్త్రీలను యెరనుచూచి మోహమను గాలమునందు దగులుకొని నశించుచున్నారని తాత్పర్యము.

స్త్రీలవేషములవల్ల పురుషులు మోసపోవుచున్నారని, వేదనాయకంపిళ్ళకీర్తనలో నిట్లు చకరేగ జెప్పియున్నాడు.

( కమాసురాగము - ఆదితాళము )

ప॥ మాదరై నినైయాదే - నెంజే - మాదరై నినైయాదే ॥
అ। భూతలమేల్ పెరుం- పాతకముంవిప-రీతముంసేపరుం-అదలినాల్‌వరు॥

౧. అరుమంజట్పూచ్చల్ల-వోమూగకాన్తి ।
అడికడి డిప్పల్ నిర - మారుంపచ్చోంది ।
వారుమైయా అవర్గళై - విరుంబుదర్ భ్రాంతి ।
ప్రకరుటప్పుగుందు పార్తాల్‌వరుంవాంది ॥ మాదరై ॥

౨. ఇడైయిల్‌మయంగువదు , శాలియ శేలై ।
ఇరుకాదుల్‌శోవిప్పదు - తట్టాక వేలై ।
కడైయిల్ విర్పదు - కొండెపూమాలై ।
కన్నికు-చ్చొందమిల్లాం - వారుంతోలే ॥ మాదరై ॥

( ఇందుకు తెనుగు )

ప॥ నాతుల స్మరియించక - మనసా - నాతులస్మరియించక ।
అ॥ భూతలమున బహు - పాతకమును విప ।
రీతమునొనతి - రోతయగాపర ॥ నాతుల ॥

౧. పసుపువలన ముఖ - పచ్చనికాంతి ।
పదెపదెమారును - పైమైజ్యోతి ।
వట్టిదివారల - వలచెడిభ్రాంతి ।
వారిలోపలజూచిన - వచ్చునువాంతి ॥ నాతుల ॥

౨. సొగసగుచీరెకు - స్వంతముసాలే ।
శోభిలుచెవిసొమ్ము - చేసెకంసాలి ।
సిగకొప్పునవం - గడిపూమాలే ।
స్త్రీలకు స్వంతమం - తయు వట్టితోలె॥ నాతుల॥ (సశేషము-)

ఓమ్.

జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము

(పన్రెండవ సంచిక.)







ఇది,

శ్రీమాన్, బ్రహ్మశ్రీ బెంగుళూరు

పండిత శ్రీనివాస భాగవత స్వాములవారిచే

నుపన్యసింపబడి

శ్రీయుత సి. యస్. రావుగారిచే వ్రాయబడి


మద్రాస్

శ్రీలక్ష్మీ నృసింహ విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడియె.

25-9-14.

COPIES AVAILABLE AT Y. GOVINDARAJULU CHETTY

NO, 19, STROTTEN MOOTHIA MUDALY STREET, MADRAS.

లు, వీటికన్నను రుచికరములగు నామములు గలవాడును, దేవతాదులకు ను జూడశక్యముగానివాడును, బ్రహ్మనున్న, పంచభూతములనున్న కుక్షియందుగల మహానుభావుడున్న, నిర్వికారుడున్న, అగు భగవంతుని యేయేదినము మనుజుడు ధ్యానించడో ఆదినమున వాడు మనుష్యజన్మము నెత్తినవాడుకాదని జెప్పిరి. గాన వ్యర్థము గడచిపోతున్నదేయను దుఃఖ మున్న శరీరము అనిత్యముగదాయను భీతిన్ని మనస్సునందు గట్టిగ దగిలిన వారికే అనవరతమును భగవధ్యానమునుజేసి నిర్వాణసుఖమును పొందవల యు ననుబుద్ధిపుట్టును. తనశరీరము అనిత్యమని నిజముగ మనస్సునకు దోచి న తక్షణమే తక్కినవన్నియును యట్లే అనిత్యమైనవని తప్పకతోచి అన్నిటి యందునను వైరాగ్యముకలుగును, అట్టి వైరాగ్యము బాల్యయౌవనాది యేదశయందైనను కలుగవచ్చును. శ్రీమచ్ఛంకరాచార్యులవారు యెనిమి ది సంవత్సరముల బాల్యముననే సన్యసించిరి. వారి భగవధ్యాన శ్లోకము లైన 'లక్ష్మీనృసింహ మమదేహికరావలంభం' అనునవి అత్యద్భుతము లై యున్నవి.

ఇదిగాక యొక ద్రవిడదేశపురాజకుమారుడు వివాహమును పట్టాభిషేకమును అయినపిదప మంచి యౌవనప్రాయముననే పూర్వ జన్మపుణ్యమువలనను భగవదనుగ్రహమువలనను వైరాగ్య ముద్భవించి, యొకనాడు సింహాసనమునుండి లేచి తనరాజ్యమును, తల్లి, తండ్రి, దారా,పుత్రమిత్రా మాత్యాదుల నందర్నను వదలి,తపస్సుచేయబోయెను. అతని చరిత్రము 'మహారాజాతురవు' అను గ్రంథమునందున్నది. అట్లడ వికి పోవునప్పుడు తల్లితండ్రాదులు త్రోవకడ్డపడి పోవద్దని ప్రార్థించగా యారాజకుమారుడు వారితో నిట్లుచెప్పెను 'అరివినోక్కుడిలవరుక్కు త్తాయి తంద్రైవై యువ్వుడలదనైనోక్కి-విరైయునీరు పాదానకరణమన్నిరుమాయై యునిలుండాగుం కురియిదువింగాయిఙ్ మణ్ణిలెనైప్పెరాదవరలైయకో ళై నీరునిరైయుమదియులరే, నీర్ నిల్లుమెనవిరువరైయు నీత్తుప్పోనేఙ్॥' అనగా, జ్ఞానమునకు తల్లితండ్రులులేరు, నాశరీరమునకై చింతించు మీరు దానికి కారణభూతులేగాని, మాయాకల్పితమైన యీశరీరముగల నాకును మీకు ను యేమి సంబంధమున్నది; ఇదివరకు నేను యెందరికోపుట్టినాను, ఈత త్వమును మీరు తెలుసుకొనలేదు. అని వారి నచటవదలి తాను వెడలి పోయెను. ఆయావనమునందంతటి మహారాజకుమారుని కట్టిజ్ఞానముకలు

గుట పూర్వజన్మ పూజాఫలమై యుండవలయును, లేకున్న అట్లుగలుగదు. కావున ప్రతిమనుజుడును యిదివరకును సత్కార్యములను సలుపక, సత్కథాశ్రవణమును సద్గురుసేవయును చేయక సుజ్ఞానమును సంపాదించకయే కాలమును వ్యర్థముగ గడచిపోతున్నదేయని వ్యసనము కలుగవలయును. శ్రీ తాయుమానస్వాములవారు,

ఇప్పిరవియెనుమో రిరుడ్కడలిల్మూழ்గినా
నెన్నుమొరు మకరవాయ్పట్టు, టిరువనై యెనుంతిరై
యినెత్తుంసుఴుప్పద, మెనక్కోంగైవరిశైక్కట్టుం
దుప్పిదప్పుయలిన్ తుఱుల్ము యెఱ్చుండమారుత
చ్చుళ్ళత్ట వందువందడుప్ప, చ్చోగారవాస్సైయెనుంకానాడు
వాసదిసుకందజెనమేలుమూర్ప, క్కైకపరిసుకార
గ్గోప్పెల్ అఱివాన అంగముంక్కైవిట్టుమఱిమయంగి
కళ్ళవంగకాటల్ వరువరౌద్రంజియే, కణ్ణువికాట్టు
మెళిమేల్, ఎప్పరియము త్తియాంకరై శేరవుల్కరుళ్
శైవయో శక్రాగియెల్ శిత్తమిశ్శైకుడికొండవరివాస
దైవమే తేజోమయానందమే॥ యని జెప్పిరి.

అనగా, పుట్టుకయను అంధకారమయిన సముద్రములోబడి అహంకారమనే మొసలినోట పట్టుబడి, పుణ్యపాపములను అలలచే క్రిందుమీదుగ త్రోయబడి, యింద్రియవిషయాదులను సుడిగాలిచే చుట్టిచుట్టి గొట్టబడి అంత్యములేని ఆశయను ఆకాశగంగ నాతలపై బడుచుండగా, దీనినుండి తప్పించుకొని దాటిపోవుటకు అస్థిరమైన యీశరీరమును యీతబుట్టను నమ్మికొని స్థిరమయిన జ్ఞానమను నావను వదలిపెట్టితిని, యిపుడు మహాభయంకరమయిన యముడను చోరనావ యెప్పుడువచ్చి నన్ను దీసికొనిపోవునోయని భయపడి నోటిమాటలతో చెప్పుటకు సాధ్యముగాని మోక్షసుఖమును యెట్లుపొందుదునాయని యేడ్చుచున్న నన్ను కటాక్షించవలయునని తాత్పర్యము. ఈప్రకారము అనిత్యమైన యీశరీరము యెప్పుడైనను తెలియకనేపోవునే ఆత్మజ్ఞానమును యెప్పుడు వడయుటయని దుఃఖించుచుండువానికి యెవరును చెప్పవలసియుండదు. ఎట్లనగా, అమ్మా, నాకు నిద్రవచ్చుచున్నది నిద్రించెదను నాకు ఆకలిగొనినప్పుడు నీవు నన్ను లేపుమని చెప్పుబిడ్డనుచూచి, నాయనా నీకాకలిగొనిన నేను లేపవలసినది

లేదు, నీయంతట నీవే లేవవలసివచ్చునని తల్లి చెప్పినట్లు, బహిర్ముఖవ్యాపారమను నిద్రలో జూచునవియన్నియును అనిత్యములని తెలిసికొనినంతట అంతర్ముఖలక్ష్యములేక కాలము వ్యర్థమయిన దేయను వ్యసనమును నట్టి ఆకలిగలిగినవారికి ఆత్మజ్ఞానమునకై పాటుపడమని యొకరు చెప్పవలసిన పనిలేదు, ఆకలిగొన్నవా రన్నమున కాశించునట్లు, సంసారదుఃఖములను బోగొట్టుకొని మోక్షమును బొందుటకు సద్గురూపదేశమును వారే వెదకి సంపాదించుకొందురు. అట్టి వ్యసనము గలిగి సద్గురూపదేశమును వెదకుచున్న రామచంద్రమూర్తి యింతకుముందు దెలిపిన బాల్యావస్థకు ఆవలిదశయైనట్టియు అట్టి దుస్స్వభావమే గలదియైనట్టియు,

యౌవనావస్థను:— అనుదానినిగూర్చి యిట్లు చెప్పెను.

శ్లో॥ బాల్యావస్థా మసంత్యక్త్వా, పురూనభిహతాశయః ।
ఆరోహతి నిపాతాయ, యౌవనం సంభ్రమేణతు ॥

బాల్యావస్థయందు అనేక బాధల ననుభవించి మరియొకవిధమైన బాధలననుభవించుటకు మనుజుడు యౌవ్వనదశను చెందుచున్నాడు;

'కామాతురాణాం నభయంనలజ్జా' యనునట్లు,

శ్లో॥ స్వచిత్తబిలసంస్థేన, నానావిభ్రమదాయినా ।
బలాత్కామపిశాచేన, వివశః పరిభూయతే ॥

యౌవ్వనప్రాయమునకువచ్చిన పురుషుడు తన మనస్సు అను బిలమునందుండు కామము అను పిశాచముచే బలాత్కారముగ పట్టుకొనబడినవాడై దానివలన అనేకవిధములైన విభ్రాంతులు గలిగి అవమానపడుచున్నాడు.

కామము, అనగా ఆశ, యౌవ్వనమునందు పట్టు స్త్రీవిషయాదులయందాశయను కామపిశాచమును జయించుటకు యెంతటివారికైనను సాధ్యముకాదు. అట్టి కామపిశాచముపట్టినందుననే పూర్వము యింద్రచంద్రాదులును మహర్షులునుగూడ అనేక అవస్థలబడిరి.

పాట.— చందిరన్ కెట్టదుం పెణ్ణాలె - తవదారుగర్ కెట్టదుం పెణ్ణాలె।
ఇందిరన్ దేహముఱ్ఱువదుం - భిన్నమాయ్ మైయిదదుం పెణ్ణాలె ।
రావణన్ కెట్టదుం పెణ్ణాలె - పౌవురాక్షదర్ కెట్టదుం పెణ్ణాలె ।
పాండవర్గళదు - ర్యోదనాదియుం-యుళ్ళిందదుం పెణ్ణాలె మానిడనే॥

కోవిలకపట్టదుం పెణ్ణాలె - తవంకౌశికర్ విట్టదుం పెణ్ణాలె ।
అవల్ తవంశైద భస్మాసురన్ - అழிన్దదుం పెణ్ణాలె - మానిడనే ।
శండయుం దండముం పెణ్ణాలె - కుత్తువెట్టువెట్టుత్తిట్టుం పెణ్ణాలే ।
మండైవుడైవదుం పూకెళ్లాలె నిర్వదుం మంగయాలల్లవో। మానిడనే॥

( ఇందుకు తెనుగు. )

పాట.-- చంద్రుడు చెడ్డది స్త్రీవలన - సత్ - దాయుగల్ చెడ్డది స్త్రీవలన ।
ఇంద్రుని దేహము యోనులగానట్టి - భిన్నములైనది స్త్రీవలన ।
రావణుమరణము స్త్రీవలన - లంక - రాక్షసహతము స్త్రీవలన ।
దొడ్డరాజులైన దశ్శ్యోన నాదులు-దుసిసింది స్త్రీవలన మానవుడా ॥
కోపిలుడాగింది స్త్రీవలన - తపః - కౌశికుభంగము స్త్రీవలన ।
తపసు చేసిన భస్మా-సురుడును తా ప్ర-హ డిసింది స్త్రీవలన। మానవుడా॥
జగడము జంతియు- స్త్రీవలన-చాల-కొట్లు తిట్లుపెట్లు స్త్రీవలన ।
శిరసులు ద్రెంచుట - కొత్తులోనిల్చుట - స్త్రీ మూట్లవల్లనే। మానవుడా॥

ఇట్లు పురుషులకు గలుగు సమస్తదుఃఖములకును స్త్రీలే మూలమనుటకు దృష్టాంతము॥

శ్లో॥ స్త్రియోహి మూలం నరకస్య పుంసాం - స్త్రియోహి మూలం పాపస్య పుంసాం । స్త్రియోహి మూలం కలహస్య పుంసాం - స్త్రియోహి మూలం మరణస్య పుంసాం॥ యని అనేకమంది పెద్దలు చెప్పియున్నారు.

ఇట్లు యౌవ్వనమునందు పరస్త్రీగమన ఆశయనుపిశాచముపట్టి యాశించునప్పుడు, ఆ స్త్రీలవలననే అన్ని యనర్థములును సంభవించును, కావుననే

పాశురము॥ వంబులాంకూందల్ - మనవియైత్తురందు పిఱర్ పొరుళ్
తారమెంద్రివత్తై-వంబినార్ యిరందాల్ నమండ్రిమర్గట్టి
మెత్తివైత్తు యెరియెழుగింద్ర శంబినాల్ యియంద్రి
పావనై పావి త్తువెనమొழி వదరుంజి నంబినేన్ వందున్
తిరువడి యడైన్దేన్॥ అనగా,

సుందరమైన స్వకళత్రమును వదలి పరస్త్రీని పరిగ్రహించినవాడు గతించగా యమదూతలు వానిని పట్టుకొని యెర్రగా కాలియున్న లోహప్రతిమలను జూపి, పాపి, వీటిని ఆలింగనము చేసికొనుము అనుమొదలైన భయంకరమగు మాటలను వినుటకు భయపడి దీనుడనై నీపాదపద్మములనాశ్ర

యించితిని జగత్తేశాయని శ్రీతిరుమంగైయాళ్వార్లు సెప్పియున్నారు. ఇట్లు యుభయమైనను దోచి భగవధ్ధ్యానము జేయవలయును. అట్లు చేయని వారివిషయమై శ్రీతొండరడిప్పొడియాళ్వార్లు తిరుమాలైలో 'పెణ్డిరాల్ శుగజ్గళుయ్యప్పార్, పెరియదోరిడుమ్బైపూణ్డుయ్యగ్గ' యను పాశురములో, రాత్రికాలమునందు భుజించి స్త్రీభోగసుఖమును గోరి శయనించునపుడు, శరీరపోషణకై కృశించి మనస్సునొచ్చి సర్వేశ్వరుని ధ్యానామృతపానమును పానముచేయనినీచులు అన్నము నెట్లు దినగోరుదురోయని చెప్పియున్నారు. ఇట్లు యవ్వనమున మనస్సుచెడి మంచి తెలివియుండదు. గాననే రామచంద్రుడు,

శ్లో॥ ఏ స్సిద్ధాపి ప్రసన్నాపి పాపస్య విహీయానవనే । మతిఃకలుషతామేతి ప్రావృషీవతరంగిణీ॥ ఎంతవిశాలమై నిర్మలమయిన మనస్సుగలవాడైనను యవ్వనకాలమునందు వర్షాకాలమున నదులలో కలకబారిన యమునునీళ్ళవలె, కలకబారి చెడిపోతున్నది యని చెప్పెను.

ఎంత చదువు చదివినను సార్థకములేదు. చదువునకును ఆత్మజ్ఞానమునకును సంబంధములేదు. యెంతచదివినను శ్రవణ మనన నిధిధ్యాసములులేక వైరాగ్యము గలుగదు. ఎన్నిశాస్త్రములు చదివినను సద్గురువుల నాశ్రయించి శ్రవణ మననాదులు జేయక వేదాంతశాస్త్రమునకు సరియైన అర్థము దెలియకపోవడమేగాక సాధారణచర్యయును విపరీతముగనే యుండును.

యవ్వన వైదిక బ్రాహ్మణుడొకడు కావేరీతీరమున తులామాస స్నానముజేసిన సుమంగలులకు( ముత్తైదువులకు) ఆస్నానమహాత్మ్య శ్లోకములను రసాభాసముగ జెప్పి, వాటి 'అర్థము' గలదే అది యెట్లనగాయని యనుటలో అరవమున 'అరతముండే' యనియును పిదప దక్షిణతాంబూల సమయమున పండ్లు ఫలస్వర్ణపుష్పవస్త్రాదియుక్తతాంబూలము తనవంటి సద్బ్రాహ్మణునకిచ్చిన పుణ్యమును యిహపరసుఖములునుగలుగుననియును చెప్పుటలో "పుణ్యముండే-ఇహముండే. పరముండే' యని జెప్పెను.'ముండే' అనుదానిని పూర్వపదముతోచేర్చిపలికినపుడు 'విధవస్త్రీ' యనియును, సంధిని విభజించి 'వుండే' యని పలికిన, స్థిరముగ కలుగుననియును, అర్థమగుచున్నది. అందరు సుమంగలులు వున్నసందర్భమున అట్టి అమంగళవాచక ప్రయోగమును, అనాయుక్తమైన ఆత్మస్తుతియును జేయగూడదను తెలివిలేక ఆయువ్వనమున్ను, ఆత్మజ్ఞానములేని వట్టిచదువున్ను అట్లు నటింపజేసినది.

కావున సద్గురు సేవజేసి శ్రవణమననాదులవలన జ్ఞానమును పొందవల యును గాని చదివినమాత్రమున ప్రయోజనములేదు.

రామచంద్రుడు మరియు నిట్లు చెప్పెను. శరీరమను మరుభూమి యందు యవ్వనమను యెండమావుల కొఱకు మనస్సను మృగము (జింక) తృళ్ళితృళ్ళి పరుగులిడుచుపోయి విషయములను గుంటలో పడుచున్నది. యవ్వనముండునంతవరకును కాముకులు కామజ్వరపీడితులై నశించుదురు. ఎవరు యవ్వనసంకటములలో చిక్కుకొనక తప్పించుకొను జ్ఞానమునుసం పాదించుకొనినవారో వారె పూజనీయులును, మహాత్ములును, పురుషులు నగుదురు. అట్టివారు దుర్లభమనటకు,

శ్లో॥ వినయభూషితమార్యజనాస్పదం-కరుణయోజ్వలమావలితంగుణైః ఇహహిదుర్లభమంగశయావనం-జగతికాననమంబరగంధయా॥

ఈజగమునందు వినయవిధేయవిజ్ఞానాదిసద్గుణములతో గూడియున్న యవ్వనముగలవారు ఆకసమునందడవివలె దుర్లభమని రామచంద్రుడనెను. వారు చెప్పినట్లు జ్ఞానమటులుండ, వినయవిధేయతలు అనగా తానను అహంకార గర్వమును వదలిన సాధుత్వము గలుగుటయే కష్టము. భగ వంతుడతి సులభుడు. ఆయన కట్టిగర్వములేదు. శ్రీపురంధరదాసుగారు చెప్పినట్లు,

కీర్తన॥ ప॥ హువ్వతరువరుమనగె - హుల్లతర్వార్॥

అ॥ ఆలకుమీపతిగె-అవగిల్లెగర్వార్॥

చ॥ భాగ్యదల్లినోడలు-లక్ష్మీదేవిగపతియు - రూపదల్లినోడలు మన్మథగెపితను, అధికారదల్లినోడలు అంబుజోద్భవపయ్య, భూపతనదల్లి నోడలు, భూదేవిరమణా॥ హువ్వ॥

భగవంతుడు భాగ్యమునందు జూడ లక్ష్మీదేవికి పతియును, రూపము నందు మన్మథునికి తండ్రియును, అధికారమునందు బ్రహ్మకు తండ్రి యును, భూస్థితియందు భూదేవికే నాయకుడును, అయ్యుండియును, యెవరైన తనను పుష్పములచే పూజించినమాత్రమున వారింటికి కసవు మోసికొనివచ్చి పశువులకు వేయును, ఆయన కేమాత్రమును గర్వములేదు.

కావున అహంకార మమకారాదులను వదలి శరీరము అనిత్యమని సదా జ్ఞాపకమునందుంచుకొని, బరువుమూటను మోయువాడు ఆమూట ను యెప్పుడుదించుదునాయని యెంత ఆతురముతోనుండునో అంత ఆతుర

ముతో యీశరీర తత్త్వమును చక్కగా విచారించి విషయాదులందేమియు సుఖములేదని ఒక్కటొకటిగవదలి యందువైరాగ్యము గలుగవలయును.

శ్రీమద్రామాయణములో జెప్పియున్నట్లు,

“శ్లో॥ హిత్వాధర్మం, తతార్థంచ కామంయస్తు నిషేవతే । సవృక్షాగ్రే యథాసుప్తః పతితః ప్రతిబుధ్యతే॥” ధర్మమునువదలి కామవిషయాదుల ననుసరించువారు చెట్టుపైకిపోయి ఒకలేతకొమ్మను పట్టుకున్నవాడెట్లుపడిపోవునో, అట్లుచెడిపోదురు.

“శ్లో॥ నన్దన్త్యుదిత ఆదిత్యే, నన్దన్త్యస్తమితేరవౌ । ఆత్మనోనావబుధ్యంతే, మనుష్యా జీవితక్షయం॥”— మనుజులు సూర్యోదయమునందున్ను సూర్యాస్తమమునందున్ను సంతోషించుచున్నారుగాని తమఆయువునందు అంతకాలము తగ్గిపోయినదేయనువ్యసనపడు బుద్ధిలేకున్నది.

వ్యర్థముగ ఆయువు క్షీణించిపోతున్నదే యనుదుఃఖము కలుగవలయును. మనుజులకు యిట్టిదుఃఖములేక విషయాదుల దుఃఖములో బడియున్నారు. శరీరమునందు జీవుడుచేరినదిమొదలు కష్టములు గలుగును. వాటినన్నిటిని నివర్తించుకొని మోక్షమునకు పాటుపడవలెను. పరమాత్మకు జీవునికి జననమరణాది దుఃఖములులేవు. జీవాత్మయును, పరమాత్మయును వొకటిగనేయుండును. యెప్పుడు వేరగుననగా, ఆశయనునది గలిగినప్పుడు వేరగును. జనకమహారాజు యాగశాలయందుబుట్టి యోనిసంభవురాలుగానట్టి సీతను జీవాత్మయనవచ్చును. సీత, యనుపదము స్త్రీలింగముగాన, సదాసర్వేశ్వరుని ఆశ్రయించియేయుండును. సీత యను జీవాత్మ, రాముడను పరమాత్మతోగూడి, మోక్షమార్గము నవలంబించియుండగా, మారీచుడను స్వర్ణమయమాయా మృగముపై ఆశయను భ్రమగలిగి తత్క్షణమున, పరమాత్మనుండి వేరై, రావణుడను అహంకారమునకు వశమగును. జటాయువను కర్మయోగమువలన తప్పించుకొనుటకు ప్రయత్నపడియును, ప్రయోజనములేనందున రావణుడను అహంకారము తనను పట్టిదీసుకపోవుచుండగా, ఆభరణములను పడవేయడమను కొన్నిసత్కర్మలనుజేయును అట్లు దీసికొనిపోయి లంకయను శరీరమునందు బెట్టి ఆ రావణుడను అహంకారమునకు ఆత్మజులైన, మదమాత్సర్యాదులను యింద్రియ విషయాదుల మధ్యనుంచును. రాముడను పరమాత్మ సీత యను జీవాత్మయేమైన సత్కర్మలజేసినదాయని తెలసికొనను వెదకుచుబోయి ఆయాభరణ

ములను సత్కర్మలను జూచి సీతయను జీవాత్మ తన పాపములను బోగొట్టి ఆత్మజ్ఞానమున కాశించి యున్నదనిన్ని జ్ఞానోపదేశమునకు దగియున్నదనిన్ని తెలిసికొని గురువునకు దగిన సద్గుణములుగల హనుమంతుడను ఆచార్యుని వుపదేశమంత్రము నిచ్చి పంపును. పరమాత్మ తనకునియమించిన పనియందు హనుమంతుడను ఆచార్యుని పరమభక్తి విశ్వాసములనుజూచి ఆసత్కర్మ జేసి జ్ఞానాసక్తయై యున్న జీవాత్మను కష్టపడి కనిపట్టి దుఃఖాంధకారమను తెరను దీసివైచి మానవ జన్మస్వభావమును దెలిపి రాముడను పరమాత్మ విషయమైన సత్కథాశ్రవణమును చేయించి శాంతపరచి "ఓం నమో నారాయణాయ" అను యెనిమిది రత్నములు గల రామముద్రికయను అష్టాక్షరీ మంత్రము నుపదేశించును. పిదప జీవాత్మకు బంధవిముక్తియగు నను మనోనిశ్చయము గలుగును. శ్రవణానంతరము మననిధిధ్యాసల వలన సీతయను జీవాత్మ రావణుడను అహంకారమును బొత్తిగ నశింపుజేసి జననమరణాగ్ని గుండములోనుండి నిర్మలముగ వెడలి మరల యధాప్రకారముగ రాముడను పరమాత్మ యందైక్యమై యుండును. రామాయణ తత్వమిట్టిదని యెఱుగవలయును.

ఇందున గురువుగ చెప్పబడిన హనుమంతు డెంతటి మహానుభావుడనగా "వినా రామం- వినా భీష్మం- వినా శుకం- వినా హనుమంతం" అనగాః స్త్రీవిషయాదులను బొత్తిగ నెఱుగని పరశురాముడు, భీష్మాచారి, శుకబ్రహ్మం, హనుమంతుడు అనునీనలుగురిలో నొకడైన నిత్యబ్రహ్మచారియైన వుత్తముడు. సద్గురువున కుండవలసిన యుత్తమగుణములలో నిదియే ముఖ్యమయినది.

వేదాంతవిషయములను జెప్పెడువారెవరైనను యుండవచ్చునుగాని చెప్పినదానిని శ్రద్ధతో వినిమననము చేయువారు వేయుమందిలో నొకరైనను యుండుట దుర్లభము.

శ్లో॥ ఏషాం నవిద్యా నతపో నదానం నచాపిశీలో నగుణో నధర్మః।
తేమర్త్యలోకే భువి భారభూతాః మనుష్యరూపేణమృగాశ్చరంతి॥

అనినట్లు, యెవరికైతే బ్రహ్మవిద్యయును, భగవధ్యానమును, ధాతృత్వమును, సత్ప్రవర్తనయును, సద్ధర్మగుణమును లేవో, అట్టివారు భూమికి భారముగ తిరుగులాడు మానుషవేషమును ధరించిన మృగములతో సమానులని తాత్పర్యము.

ఓమ్.

జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము

(పదునాకండవ సంచిక

**PART-1**








ఇది,

శ్రీమాన్, బ్రహ్మశ్రీ బెంగుళూరు

పండిత శ్రీనివాస భాగవత స్వాములవారిచే

నుపన్యసింపబడి

శ్రీయుత సి. యస్. రావుగారిచే వ్రాయబడి

మద్రాస్

శ్రీలక్ష్మీ నృసింహ విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడియె.

18-9-14.

COPIES AVAILABLE AT Y - GOVINDARAJULU CHETTY:
NO, 19. STROTTEN MOOTHIA MUDALY STREET: MADRAS.

శ్రీమాన్, బ్రహ్మశ్రీ. బెంగుళూరు, పండిత, శ్రీనివాస భాగవతస్వాముల వారి జ్ఞానవాసిష్టోపన్యాస సంగ్రహము.

# వైరాగ్య ప్రకరణానుబంధము.

(పదునొకండవ సంచిక - ౧వ భాగము.)

శ్రీయుత, సి. యస్. రావుగారు యిటుల వ్రాసిరి:—

లోకమునందు ఆనందము, ఆనందము, అనునది అపరూపమైనది, దానిని అనుభవసిద్ధముగ నెఱుగనివారికి మాటలతో చెప్పిన సుఖములేదు. ఆనందమను దానిని అనుభవించి తెలుసుకొనవలయునే గాని దానికి నిజమైనఅర్థము యేనిఘంటు (*Dictionary*) నందునుకనుపడదు. ఎట్టిదృష్టాంతమును దానినిజస్థితిని దెలుపజాలదు. ఐనను యిపుడు చెప్పబోవు దృష్టాంతమునకన్నను వ్యక్తమయినదిలేదు. ఒకనాడు యమునానదీతీరమున పూర్ణచంద్రోదయసమయమున గోపికాస్త్రీలమధ్య శ్రీకృష్ణభగవానులు రుక్మిణీసమేతులై ఆనందముగ విహరించుచు భక్తియును ఆనందమును వారికందరకును యేతీరుననున్నదని పరిశోధించుటకు యొక సుందరమయిన ఆవుదూడను మృతినొందునట్లు మాయజేసెను. ఆదూడనుజూచి యాస్త్రీలందరును దుఃఖపడగా భగవంతుడా స్త్రీలనుజూచి మీరు దుఃఖపడనేల మీకందరకును దేనియందు నిజమైన ఆనందము కలదో దానిని వొక్కొక్కరును తప్పక నిజముగ జెప్పినట్లయిన యాదూడ మరల బ్రతుకునని చెప్పగా, మొదట యొకగోపిక భగవంతునిజూచి, యీయమునలో నీతోడ జలక్రీడయాడుట నాకానందమనెను, మరియొకతె సదా నీతో భోగించుట నాకానందమనెను, మరియొకతె సదా నీమురళీగానమును వినుట నాకానందమనెను, మరియొకతె సదా నిన్నుచూచుచుండుట నాకానందమనెను, మరియొకతె మంచి ఆభరణవస్త్రాదుల నలంకరించుకొని సదా నిన్నాలింగనము చేసికొనియుండుట నాకానందమనెను, యిట్లందరు గోపికలును అనేకవిధముల చెప్పినను యాదూడ బ్రదుకలేదు, తుదకు లోకనాయకియు తన ప్రియభార్యయు నగు రుక్మిణీదేవివైపున భగవంతుడు చూడగా ఆమెలేచి స్వామీ! నీవేనేను, అనగా నీవును నేనును యొక్కటియేయని తెలుసుకొని ఆనందించుచుండడమే నాకు బ్రహ్మానందమని తననిజస్థితిని చెప్పినవెంటనే, మృతినొందిన యాదూడ బ్రతికిలేచినది. ఇట్టి నిశ్చయమును నిశ్చలమును

హైన ఆనందముగలిగినగదా ఆనందము, యిట్టిదని తెలియును. ఆనందము కలుగుటకు చపలమయిన చిత్తమును స్వాధీనపరచుకొని నిలుపుటయే సాధనము. మనస్సు స్థిరముగ నిలువనియెడల ఆనందమిప్పటికిని కలుగనేరదు. ఆనందముగ నున్నానని మాటచెప్పవచ్చును గాని అది నిజమైన ఆనందము గాదు. మనః చాంచల్యము మానక ఆనందముకలుగనేకలుగదు. మనస్సునకు అంతర్ముఖమును బహిర్ముఖమును, కలదనియును, అంతర్ముఖమున జూచిన ఆత్మలాభము కలుగుననియును బహిర్ముఖమున జూచిన ప్రపంచ వ్యాపారములకు లాగి పలుదుఃఖముల పాలుజేయుననియును యిదివరకే చెప్పబడినది. 'మత్తయెడత్తేడివాழ், నాళైపోకాటமல், వుత్తయెడత్తై తేడి, వురంగవదెకాட்லం' అనినట్లు ఆనందములేని తన వెలుపల బహిర్ముఖమున చూచుకొనుచు వృధాగా కాలముగడపిన నేమిఫలము; ఆనందము నిజముగయున్న తనలోపల అంతర్ముఖమున చూచుకొనుచు ఆనందసుఖమును అనుభవించవలయును అని తాత్పర్యము. సదా బహిర్ముఖమున చూచుచు ప్రపంచవ్యాపార చింతగలవానికి, శరీరము పోతుందను భయమును వ్యసనమునుగలవానికి నిముషమయినను నిద్రపట్టదు. శరీరము యెప్పుడైనను పోవలసినదేయను నిశ్చయజ్ఞానముగలిగినంతటనే నిద్రబట్టును. బహిర్ముఖమున జూచుచున్న యొకసామగుడు యొకసరుకును మరియొకయూరికి యోడమీద ద్రవ్యలాభముకొరకు పంపి యదిమొదలు ఆయోడ యిప్పటికెంతదూరముపోయియుండును యిప్పటికాయూరు చేరియుండును యిప్పటికా సరకు విక్రయమైయుండును యని ఆసరుకును ఆయోడయును కంటికెదుట కనుబడకుండినను ఆయోడపోవునదియును ఆయూరు జేరునదియును ఆసరకు విక్రయమును దాను ప్రత్యక్షమున చూచుచుండునట్లె మనస్సున సదా స్మరించుచు దానివలని ద్రవ్యలాభము తనచేతికివచ్చువరకును, యెట్లు నిద్రపట్టక వేరే వ్యవహారమును గమనించకయుండునో అట్లె 'కాయం, నిలైయల్లవెంద్రు, కాణ్బారురంగువరో, తూయఅరుళ్ప్రత్తాత్తోడర్వార్ పరాపరమే' యని శ్రీతాయుమానస్వాములవారు చెప్పినట్లు, శరీరము అస్థిరమని తెలుసుకొనినవారు, మాయ,యనునిద్రలోబడకుండ సంసారదుఃఖములోచిక్కుకొనక ఆత్మజ్ఞానలాభమును పొందుటకొరకు సదా ప్రయత్నముచేయుచుందురని తాత్పర్యము. అట్లుచేయక వ్యర్థముగ కాలము గడపుచుండిన అస్థిరమయిన శరీరము యెప్పుడో పడిపోవును. పలుదేశముల ప్రయాణి

కులు మధ్యమధ్య బంధ్లలోను, సత్రములలోను, చావిళ్ళలోను సంధించినప్పుడు ఆప్తులవలె అన్నిమాటలాడుకొని అన్ని వుపచారములను చేసికొని వారి వారి ప్రియాణ పూర్తియైన బండ్లును సత్రములును చావిళ్లును విడుచునప్పుడు వొకరితోనొకరు చెప్పకపోవునట్లు శరీరమునుండి జీవుడు వెడలిపోవునప్పుడు తనకుఆప్తమైనవారినందరిని వదలిచెప్పకనే తాను మాత్రమే పోయిమరియొక శరీరమునుధరించుచున్నాడు. గావున శరీరము అనిత్యమైనదని గమనించక, ఆత్మలాభమును తెలిసికొనక, ప్రపంచవ్యాపారములను దగ్గించుకొనక యెంతకాలము ప్రపంచ వ్యాపారములయందు మనస్సువుంచియున్నను అంతకాలమున్ను ఆత్మజ్ఞానము కలుగనేరదు. ప్రపంచధర్మము యెట్లున్నదనగా,

"వేదనూల్ పిరాయంనూఱు, మనిశర్ తాంవ్రుగువరేలుమ్।
పాదియుముఱంగిప్పోగుం, నిద్రదిల్ పదినైయాణ్డుం।
పేదై పాలగనదాగుం పిణిపశిమూప్పుత్తున్బమ్।
ఆదలాల్ పిఱవివేణ్డేన్ అరఙ్గమానగరుళానే॥

అని శ్రీతొండరడిప్పొడియాళ్వార్లు చెప్పినట్టున్ను,

"శ్లో॥ ఆయుర్వర్ష శతం నృణాం, పరిమితం రాత్రౌతదర్ధంగతం।
తస్యార్ధస్యపరస్యచార్ధమపరం, బాలత్వవృద్ధత్వయోః।
శేషంవ్యాధి వియోగదుఃఖ, సహితం సేవాది భిర్నీయతే।
జీవేవారితరఙ్గ చంచలతరే, సౌఖ్యంకుతః ప్రాణినామ్॥"

అని భర్తృహరి చెప్పినట్లున్నీయున్నది.

అనగా మనుజులకు వేదమునందు నూరు సంవత్సరముల వయస్సనియును జ్యోతిష సిద్ధాంతమునందు నూటయిరువది సంవత్సరము లనియును జెప్పియున్నది. వేదోక్తప్రకారము 'శతమానంభవతి' అనినూరుసంవత్సరములైనను, యేబదిసంవత్సరములు, నిద్రతోడను యిరువదియైదుసంవత్సరములు, బాల్య, యౌవనములతోడను, మిగిలిన యిరువదియైదు సంవత్సరములు, వార్ధిక్యవ్యాధి, వ్యసనమును, మొదలయిన దుఃఖపరంపరలతోడను, సమాప్తమగుచున్నది గాని మనస్సు ఆత్మలాభమును పొందుటెప్పుడు. సదా ఆనందమును గలుగజేయు ఆత్మలాభమునకు వుపయోగించని జన్మమునందాయువు యెన్నిసంవత్సరములున్న నేమి ప్రయోజనము. సదా చింతతో నలయుచుండువానికి సుఖమును, సంతోషమును, ఆత్మజ్ఞానమును,

ఆనందమును యెట్లుకలుగును. సదా శరీరమునకై కష్టపడుచు ప్రపంచ యాశాబద్ధుడై బహిర్ముఖచింతచేయుచుండువారు మంచి జన్మమునుయెత్తి యును సుఖమేమియున్నది. బాల్యమునందున తెలియకపోయినది. తర్వా తనైనను బుద్ధినిదెచ్చుకొని సత్కార్యములను జేయవచ్చునుగదా, అప్పుడు గూడ బంధుమిత్రకళత్రాదులయొక్క పోషణ భూషణాది పలువేషాదుల కొఱకై (యెంత ఆస్తియుండినను) యింకను ద్రవ్యార్జనము చేయవలయు నని భ్రమగలిగి యలయుచు దరిద్రుడైయుండును, మనస్సుయొక్క చాంచ ల్యమునున్ను, బహిర్ముఖ వ్యాపారములనున్ను తగ్గించక, ఆత్మలాభము కొఱకు మనస్సును యేమాత్రము నుపయోగపరచక సదా ద్రవ్యార్జనభ్రమగలిగియుండువారు యెన్నిలక్షలాస్తి గలిగియున్నను దరిద్రుడేయగుదురు.

ఈప్రపంచముయొక్క మాయ మిక్కిలి బలమయినది. అట్టిమాయా సంబంధమైన యీశరీరము జయించుటకు అసాధ్యమైనదిగాన, ఒకరా జ్యమునందు శత్రురాజులు జయించుటకు సాధ్యముగాకుండ కట్టియున్న కోటతో సమానమని పెద్దలుపోల్చియున్నారు. 'అంజికల్లాలొరుకోటై - అంద ఆనందకోటైక్కు వాంబదువాశల్ - తనదన్దినాదద్దినానా' అనగా, యీశరీరము, పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచ భూతములను అయిదురాళ్ళతోకట్టబడి, నవరంధ్రములను తొమ్మిదివాకిళ్లు గల కోటయని యొక మహానుభావుడు చెప్పియున్నాడు.

'జాయతే మృతయేలోకో, మ్రియతే జననాయచ' పుట్టుట గిట్టుట మొదలయిన షడ్వికారములను నవిశరీరమునకేగాని జీవాత్మకుయెప్పుడును యేమాత్రమునులేదు. ఇట్టిశరీరమును శాశ్వతమనుకొనియుండడము చాల మూఢత్వము. మనము చూచునవియన్నియును మాయతోసంబంధించినదని మనస్సునందు స్థిరముగ తోచవలయును. శ్రవణమునందిట్టి విషయములను యెన్నిమార్లు వినినను, యెంతసేపు వినినను, వినినంతవరకేగాని అవతల బోయిన నేదియును జ్ఞాపకముండదు. శరీరము మాయామయమయినదని యును, శాశ్వతమైనదికాదనియును, యెప్పుడో విడిచిపోవుట స్థిరమనియు ను, అనేకదినములుగా మీకు యుపన్యాసముచేయబడుచున్నందుకు మీరు మనస్సును స్వాధీనపరచుకొని, దాని చాంచల్యమును నిలుపుటకు అభ్యాస ముచేసి ఆత్మజ్ఞానమునకై పాటుపడవలయును, అని సభవారిని గూర్చి

మిక్కిలి నొక్కిచెప్పి శ్రీభాగవతస్వాములవారు రామచంద్రవిశ్వామిత్రుల సంభాషణ నందుకొని చెప్పనారంభించిరి.

క్రిందటి యుపన్యాసదినమున, శరీరము శాశ్వతమైనదికాదనియును పుట్టినదిమొదలు మృతిబొందువరకును దుఃఖకారణమేయనియును చెప్పబడి నది. ఇట్టి శరీరమునకు బాల్య యౌవన కౌమార వార్ధక్యములను నాలుగు అవస్థలు గలుగుననియును, అందున మొదటిదియైన,

**బాల్యము.**— అనుదాని యవస్థనుగూర్చి రామచంద్రుడిట్లుచెప్పెను

శ్లో॥ లబ్ధ్వాపి తరళాకారే, కార్యభారతరంగిణి ।
సంసారసాగరేజన్మ, బాల్యం దుఃఖాయకేవలం ॥

ముందుచెప్పినట్లు అస్థిరమైనట్టియును, విశ్రాంతిలేనట్టియును శరీరమును దాల్చి, అనేకప్రపంచవికారకార్యములను తరంగములు (అలలు) గల సంసారమను దుఃఖసముద్రమునందు జననమొందిన వాని బాల్యమంతయును దుఃఖకరముగనేయుండును. శరీరము అస్థిరమైనది, అందులో బాల్యము అతి వ్యసనకరమైనది, యెట్లనగా,

శ్లో॥ అశక్తి రాపదస్తృష్ణా మూకతా మూఢబుద్ధితా ।
గృధ్నుతా లోలతా దైన్యం, సర్వం బాల్యేప్రతిష్ఠితం ॥

శ్లో॥ మనః ప్రకృత్యైవచలం, బాల్యంచంచలతాపరం ।
తయోస్సంశ్లిష్యమోస్త్రాత, క ఇవాంతఃకుచాపలే॥

బాల్యమునందు బలహీనము ఆపదలు ఆశ మూకతనము, మూఢబుద్ధి, లోభము, చాంచల్యము, దీనత్వము యిన్ని లక్షణములు గలిగియుండును. ఇదిగాక మనస్సే చంచల స్వభావముగలది బాల్యమున్ను అతిచంచలమైనది, యీ రెండున్ను జేరినట్లయిన, చాంచల్యమున కంత్యమెక్కడిది. కనుక ఆపదగలుగునను తెలివిలేని అసమర్థతవలన పసిబాలుడు వీధి వెంబడి బండ్లు, గుఱ్ఱములు పశువులు మొదలైనవాట మధ్య కన్నులులేని వానివలెదిరిగి, పాము తేలు నిప్పు దీపము ఏటిని చేతబట్టుకొని, భావి గుంట మొదలైనవాటిని జూడబోయి పడి, ఆపదలను దెచ్చిపెట్టుకొనును, యేమి సంకటము కలిగినను, యేమికావలయునను కోరిక బుట్టినను తన అభిప్రాయమును చెప్పటకు మాటలురాక మూగవలె యేడ్చుచుండును. తాను కోరిన యేవస్తువునైనను దెచ్చియిచ్చుటకు తనతలిదండ్రులకు శక్తిలేద

ను బుద్ధిలేక రైలుబండి, మోటారు బండివంటి వాటినైనను గావలయునని యును వాటిని దన చిన్నతిత్తిలో దాచిపెట్టుకొందుననియును తెలివిలేని మాటల నాడుచుందును. ఒకపిల్లవాడు కాలణాకు క్షౌరము జేయించుకొని చిల్లరలేకుండినందున అర్ధణా దీసికొనిపోయి మంగలవానికిచ్చి వానివద్ద కాలణా దీసికొనుట . . . రాగా, కాలణా తెచ్చితివా యని యడిగిన తల్లినిజూచి, అమ్మా కాలణా దీసికొనను మరచినాను, వాడు బాగా క్షౌరము చేయువాడు వానివద్ద కాలణా దీసికొనుటకు బదులు ఆకాలణాకు నీవు వానివద్ద క్షౌరముచేసికొనుము అని ముద్దుమాటలతో మూఢత్వమును వ్యక్తపరచెను.

ఇట్లే, అతి చంచలబుద్ధిని గలిగియుందురు. మొదట నొక కొయ్యబొమ్మను గోరుదురు, దానినిచ్చిన మరియొక దానిని, ఆవల మరియొక దానిని యిట్లె యెంతసేపైన నెన్నిటినైనగోరుచుందురు తుదకా మొదటి కొయ్యబొమ్మతోనైనను నేమియును దీసికొనకనైనను ఆటల పరాకున దిరుగుచుందురు. ఇట్టి చంచల బాల్యావస్థలుగల జన్మము లెన్ని యెత్తబడెనో యింకనెన్ని యెత్తవలయునో దెలియదు. ఈవిషయమై ధృవస్వామి మిగుల వకోగ చెప్పియున్నారు.

ధృవుడు అయిదేండ్ల బాలుడైయుండి తనతండ్రి తొడపై నెక్కి కూర్చుండవలయునని అపేక్షించగా తన సవతి తల్లి యోర్వలేక "తండ్రి తొడనెక్కి వేడుక దగిలెనేని । బూనినాగర్భమున నాడుపుట్టకన్య। గర్భమున బుట్టగోరిన గలదెనేడు। జనకుతొడయెక్కు భాగ్యంబు సవతికొడక॥' యని పొడిచి యాడి, 'సిద్ధోక్షుబు (విష్ణువు) పదపద్మము లాశ్రయింపు పాయకహరినా । యుదరమున బుట్టనిచ్చును' యని చెప్పిన సవతితల్లిమాటలకు సహించక తనతల్లివద్దకుబోయి చెప్పిన యామెదుఃఖించి, నాయనా! నీసవతితల్లి చెప్పినటుల 'సర్వశరణ్యం । దనగలహరిచరణంబులు । గను జనకునియంకమెక్కగాదలతేని॥' అని చెప్పిన, అదియే గురూపదేశంబని తలంచి తల్లికి నమస్కరించి తక్షణంబె యిల్లువిడచి యడవికి జని తపస్సుజేయ నిశ్చయించి పోవుచున్న సమయమున నారదుం డెదురుబడి ధృవుని వృత్తాంతము నడిగి దెలిసికొని ఆబాల్యమున అంతటి వైరాగ్యముగలిగినందు కానందించి అనుగ్రహించ దలచినవాడై యిట్లుచెప్పెను. బిడ్డా! యీ పసితనమున సదా ఆటలయం దాసక్తితో తిరుగుచుండవలసిన యీప్రా

యమున నీవెకరుడ తపస్సెకరుడ సకల సామ్రాజ్యములు వదలి నీవడవికి బోవుటకు తల్లిదండ్రులెట్లు సిద్ధయులై సమ్మతించిరి. అడవిమృగములను చూచి భయపడుదువు. మహాయోగీంద్రులకే కష్టమైన నిష నీవనుష్ఠించలేవు, యింకను కొంతకాలము గడపి యోచించవచ్చునని చెప్పిన నారద మహర్షినిజూచి ధృవస్వామి యిట్లు జెప్పెను.

శ్లో॥ జాతోభూమాయా తపసారాజ్ఞః కర్మవిఘ్నక్తైః స్వహస్తేఅపస్యాం ।
సునీతిగర్భే క్రిమిభిట్పూర్ణే, ఖేదం సర్వం హ్యాస్వభవం ॥

నాతండ్రిచేసుకున్న తపస్సువల్ల నేను మలమూత్రాద పురుగుల గుంట యగు నాతల్లిగర్భమున పదిమాసములు పలుబాధల ననుభవించితిని, నా కట్లుండ నాతల్లికేమైన సుఖముగలదాయెసిన,

శ్లో॥ అకాలనిద్రాహారైర్బాధ్యా, ధాత్రిమాతా ప్రావంశమాం ।
తైలాస్వాదైరమితంఖేదం, రోదనవిపులైరస్వభవం ॥

నేను అర్ధరాత్రివేళ లేచి యేడ్చినను నాతల్లి నిద్రభంగముచే లేచిన న్నోదార్చి, నాకు స్తన్యపానమునిచ్చి నేను కోరినవస్తువులను యిచ్చి తృప్తిపరచి, అట్లుతృప్తిపరచుటకు సాధ్యముకానప్పుడును నేను రోగపీడితుడై నప్పుడును దుఃఖించుచు నాకు స్నానపానాదులచేయించునపుడును తైలాది యూషధముల నిచ్చునపుడును నేను సులభముగ యామెకు లోబడక రోదనముజేసిన నాతల్లి యెంత దుఃఖముననుభవించియుండును. ఇదిగాక,

శ్లో॥ మాతుఃక్షీరం ఘ్మాసనిపీతం జన్మని జన్మనిపతితంమే ।
భూమాతావత్ క్షీరాబ్ధిస్స్యాత్ తెమితంజననంహ్యాస్వభవం ॥

నేను తల్లిపాలు త్రాగునపుడు క్రిందకారిపడిన పాలబిందువులనుచేర్చిన యొకపాలసముద్రమైయుండును. ఇందువలన నేను యెన్ని జన్మములెత్తితినో యెన్నికష్టముల ననుభవించితినో లెక్కబెట్టజాలను, మరియును,

శ్లో॥ మాధవరుదితం నయనాంబుకణం సన్నిహితంచే జలధిసమం ।
సంఖ్యాతీతే జన్మనిహింసాం నానారూపాం మన్వభవం ॥

అట్లు అనేకజన్మములయందలి బాల్యదశలలోనే నేడ్చినపుడు నాకంట నుండికారిన నీళ్ళనుచేర్చిన యొకవుప్పు సముద్రమైయుండును. ఇట్లు యెన్ని జన్మములయందు యెందరు తల్లులకు యెంతకష్టములను హింసలను కలుగ జేసితినో నేనెన్నిదుఃఖముల ననుభవించితినో లెక్కపెట్టజాలను గాన యిట్టిజన్మములయందు యేమియును సుఖములేదని తెలిసికొని పరమేశ్వరు

ని యేకాగ్రచిత్తంబున నిలిపి తపస్సు చేయ నిశ్చయించితినని ధ్రువస్వామి నారదమహర్షితో చెప్పెను. అవల రామచంద్రుడు విశ్వామిత్రునితో నిట్లు జెప్పెను,

శ్లో॥ స్త్రీలోచనైస్తటిత్పుంజైర్జ్వాలామాలైస్తరంగకైః ।
చాపలం శిక్షితం బ్రహ్మన్ శైశవాక్రాంతచేతసః॥

చంచలమైన స్త్రీలయొక్క నేత్రములును, మెరుపులును, అగ్నిజ్వాలలును, సముద్రపు అలలును వాటిచాంచల్యమును బాల్యమునందుండు వానియొక్క మనస్సునుజూచి నేర్చుకొనినవి. అనగా, నిమిషములోన స్త్రీలదృష్టి యెందరిపురుషులయందైనను ప్రసరించును, మెరుపులు యెన్నివిధములనైనను మెఱయును, అగ్నిజ్వాలలును అట్లే లేచును, సముద్రమునం దలలును యెన్నివిధములవ ఉనక ఐొంగును, గాన వీటిచాంచల్యమునకన్నను బాల్యదశాచాంచల్యము యెక్కువయని తాత్పర్యము.

శ్లో॥ స్తోకేన వశమాయాతి స్తోకేనైవవికారితాం ।
అమేధ్యయేవరమతే బాలఃకౌలేయకోయధా ॥

బాలకుడు స్వల్పమున వశమగును, స్వల్పమున వికారమునుజెందును, శునకమువలె అమేధ్యమునందుబడి యాడుచుండును. ఎంతవెలగల గొప్ప మాణిక్యమునిచ్చినను పారవైచి యొక కొయ్యబొమ్మను కోరి దీసికొని సంతోషించును. కుక్క కుప్పదిబ్బమీద గూర్చునియున్నప్పుడు యెంగిటాకునంటగూడదని యోచించుచు యెవరైన యొకయెంగిటాకు దెచ్చి వేసిన వెంటనే బరుగెత్తి దానివద్దబడి నాకును, అట్లె బాలకుడు యెవరైన చూచుచుండునంతవర కూరకుండి యావల దనమలమూత్రములలోబడి యాడుచుండును. యింతేగాక,

శ్లో॥ సంప్రాప్తోభువనంభోక్తుమిందుమాదాతుమంబరాత్ ।
వాంఛతేమనసాత్యర్థ్యేణ తత్సుఖాయకథంభవేత్ ॥

బాలకుడు చూచినవస్తువులన్నియును దినవలెనని కోరును, కొన్నిసమయములందు మన్నునుగూడ దినును, ఆకాశమునందున్న చందమామను తనవద్దకు రమ్మని పిలుచును. (శ్రీకృష్ణుడుగూడ బాల్యమున మన్నుదిన్నట్లును తల్లియైన యశోదాదేవియడిగిన దినలేదని సాధించి తన నోరుదెఱచి

(సశేషము.)

ఓమ్.

జ్ఞానవాసిష్టోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము

(పదియవ సంచిక.)








ఇది,

శ్రీమాన్, బ్రహ్మశ్రీ బెంగుళూరు

పండిత శ్రీనివాస భాగవత స్వాములవారిచే

నుపన్యసింపబడి

శ్రీయుత సి. యస్. రావుగారిచే వ్రాయబడి

మద్రాస్

శ్రీలక్ష్మీ నృసింహ విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

14-9-14.

COPIES AVAILABLE AT Y. GOVINDARAJULU CHETTY

NO. 19, STROTTEN MOOTHIA MUDALY STREET, MADRAS.

వొకప్పుడు చతుర్వేదములున్ను శివదర్శనార్థమై కైలాసమునకుపోగా
కైలాసనాథుడైన శివుడచట కనుపడకున్న అన్నిదిక్కులయందును వెదకి
తుదకు గంగలోపలదాగి రామనామామృతపాన బ్రహ్మానందమగ్నుడై
యున్న పరమశివునిజూచి యావేదములు యెన్నివిధముల ప్రార్థించినను,
అట్టిబ్రహ్మానందకరమైన రామనామమును క్షణమాత్రమైననువదలి యుండ
జాలక వారితోనేమియు పలుకక తననిష్ఠయందే యుండెను. పరమశివు
నంతటివారికే యట్టియానందమును గలుగజేసిన పావనమైన రామనామ
మహిమను తక్కినవారేమని పొగడ గలరు.

"శ్లో॥ అబ్ధౌ, విధౌ, వధూముఖే, ఫణీనాం ముఖేచ।
స్వర్గే, సుధావసతినై, విభుదావగంతి।
క్షారం, క్షయః, పతిమృతిః, గరళం, వినాశః।
కంఠే సుధావసతిర్వై భగవజ్జనానాం॥"

సముద్రమునందును, చంద్రునియందును, స్త్రీలముఖములందును, సర్ప
ముఖములందును, స్వర్గమునందును, అమృతము వున్నదని పెద్దలు చెప్పుదు
రు. గాని, సముద్రామృతమునందు, ఉప్పుజలదోషమును, చంద్రామృతము
నందు క్షీణదోషమును, స్త్రీల ముఖామృతమునందు, వైధవ్యదోషమును,
సర్పముఖామృతమునందు, విషదోషమును స్వర్గామృతమునందు, వినాశ
దోషమునుగలుగును; సదా రామనామ భజనపరులకంఠమునందుమాత్రమే
నిర్మలమైన అమృతము వున్నదని తాత్పర్యము. నీలమేఘ శ్యామలమూర్తి
యైన రామునియొక్క నామమును సదాకంఠమునందుంచుకొని యుండుట
వలననే శివునికంఠము నీలవర్ణముగ పరిణమించుచున్నది. గాని హాలాహల
మను విషమును భక్షించినందున యనిచెప్పుట సరికాదు. మరియును మహా
సుభావుడైన త్యాగరాజు 'రామనీసమానమెవరు' అనుకీర్తనలో 'పలుకు
పలుకునకు, తేనె లొలుకమాట్లాడను' అనుటలో రెండర్థములిచ్చుచున్నడు,
రాముడుమాటలాడు పలుకుపలుకునకు నమృతము లొలుకునని యొకయ
ర్థమును, భక్తులుస్మరించు రామరామయను పలుకుపలుకునకును అమృత
ధార వారికంఠమునం దొలుకునని యొకయర్థమును అగుచున్నది. ఆరా
మనామామృతమెంత మధురమైనదనగా;

"శ్లో॥ దధిమధురం, మధుమధురం, ద్రాక్షామధురాపి, చితాపిమధురైవా।
మధురాదపి తన్మధురం, మధురానాథ స్వనామ యద్గీతం॥"

తేనె పాలు ద్రాక్ష మొదలైనవన్నియును జేరిన మధురమునకన్నను యెక్కువమధురముగలది. కావుననే పరమశివుడు యీరామనామామృతమును కంఠమునందే నిలుపుకొని ఆ యానందమును సదా అనుభవించుచున్నాడు.

ఇట్లుచెప్పుటవలన విష్ణువుకన్నను శివుడుతక్కువయని యనుకొనగూడదు. శ్రీరాములవారు శివలింగప్రతిష్ఠజేసి శివలింగార్చన చేసినట్లు ప్రమాణమున్నది. "శివలింగప్రతిష్ఠాతా- బ్రహ్మవిష్ణుశ్శంకరః- శివాయనమః- శంకరాయనమః" యని శ్రీరామఅష్టోత్తరశతనామ, సహస్రనామ శ్లోకములయందు జూడవచ్చును. యిదిగాక "మ॥ హరిరుద్రాది సురుల్నవగ్రహము లష్టాంగాది యోగవ్రతుల్ ధరవర్ణాశ్రమయజ్ఞదాన జపసంధ్యావందనాదిక్రియల్ చరణుల్సప్తసముద్రముల్ త్రివిధ దీక్షాబ్రహ్మవిద్యాధురం। ధరుల్ వేదపురాణశాస్త్రములు సీతారామనీవేకదా" యన్నట్లు సర్వమును యొకడేయనిమహానుభావులు జెప్పియున్నారు.

ఇట్టిమహిమగల నామమును ధరించిన రామచంద్రునికి వసిష్టమహర్షి యుపదేశించిన జ్ఞానమార్గము గనుకనే యిదిఅంతశ్రేష్టమైనదై యున్నది. రామనామముసదా స్మరించదగిన తారకనామమై యున్నది. 'స్మరతా నిత్యహరీ- మహతే మాయాకాయకరి" అనియొక మహారాష్ట్రసాధువు జెప్పినట్లు, సదా నామస్మరణ దృఢముగ చేయుచుండిన, మాయయేమిచేయగలదు. ఇందున, హరియనగా, భగవంతుడనియును, సింహమనియును, కరియనగా, చేయుననియును, యేనుగననియును, రెండర్థములున్నవి. విస్తారమైన శరీరముగల యేనుగను స్వల్పశరీరముగల సింహము గర్జనదర్శనమాత్రమున హతముచేయునట్లు విస్తారమైన మాయను సులభోపాయమైన భగవన్నామస్మరణ నశింపజేయునని భావము.

శ్రీతాయిమాన్ స్వాములవారుగూడ 'కాకమానవై కోడికూడు గిండాగ్రిలుమొదు । కల్లిన్ముగ్ న్నెదిర్ నిరుక్ మో । కర్మమానవైకోడి మున్నె సెయ్దాలునిన్ । కరుత్తైప్రవాహవరుత్తై, దాగమాయ్నాడినర్తై వాదికక్కవల్లవో॥" కోటికాకులు గూడియున్నను, వొక్కరాయివేసిన యన్నియును భయపడిపారిపోవునట్లు అనేకజన్మాంతరములయందు కోటి

పాపములు జేసియున్నను భగవన్నామస్మరణవలన భస్మమైపోవును గాని లేశమాత్రము బాధించనేరదు. అనిచెప్పియున్నారు.

కాబట్టి మానవశరీరమును ధరించియున్నమాత్రమున నేమియును ప్రయోజనములేదు, భగవద్విషయ శ్రవణమననాదులను శ్రద్ధతోజేసి బ్రహ్మానందమున మనస్సుకరిగి కంటినుండి ఆనందభాష్పముల జెందవలయును. ఇతరులుజూచి మెచ్చుకొనవలయునని అభినయ భాష్పములను గార్చువారు కొందరుందురు. ఎట్లనగా ఒక దేవాలయమునందలి ఆరాధ్యులు పూజాద్రవ్యముల ఖర్చులెక్కలో ఆనందభాష్పఖర్చుకాణియని వ్రాసి యాకాణికి మిరియాలుగొని తెచ్చి పూజాకాలమున దేవునిపై పుష్పములనువేయుచు మధ్యమధ్య నాలుగుమిరియములు దననోటవేసికొని నమలుచు ఆకారమువలన కంటినీరుకారగా చూచువారు ఆరాధ్యులు భగవదార్చనయందు మనస్సులయించినందున ఆనందభాష్పము లొలుకుచున్నదని మెచ్చుకొనుచుండిరి. ఆయారాధ్యులను తొలిగించి మరియొక ఆరాధ్యులా పనికి వచ్చినంతట ఆగుట్టుబయలుపడినది. అటువంటిదిగాక మనస్సునిజముగ కరగి యానందభాష్పములు గారవలయును. అట్లుకరుగుట మహాకష్టము. కావుననే ,,కల్లేనుమయ్యా, వారుకాలత్తిలురుగమేక। యేకన్నెంజమురుగవిల్లిమే॥'' సిల్పిశాస్త్రానుసారముగ రాయిమైనను ఒకప్పుడు కరుగునుగాని నాకఠినమైనమనస్సుకరుగదేయని యొకమహాత్ముండు మొరపెట్టెను. ఇందుకనుగుణముగ శ్లో॥ అతిమృదుపౌ, మమచరణౌ, అతికఠినంతే మనోభవానీశ। ఇతివిచికిత్సాం సంత్యజ, శివకథమాసీద్గిరౌ తదావేశం॥ అని శ్రీశంకరాచార్యులవారు శివునిగూర్చి, ఓపరమేశా! అతిమృదువైన నీపాదములను అతికఠినమైన నాహృదయమునందు బెట్టజాలనని శంకించి విడనాడకుము. కఠినమైన నీకైలాసగిరి రాళ్ళపైమెట్లుచలింతువో అట్లు నాహృదయమునందునను జేరి నన్నుకటాక్షించుమని చమత్కారముగా జెప్పిరి.

అట్టికఠినస్వభావముగల మనసును కరగించి వైరాగ్యమునుబూని, ఇది వరకుతృష్ణ(ఆశ) యనుదాని స్వభావమును, దానియందును, తనకుగల వైరాగ్యమును దెలిపి యిట్లుదువ్యర్థముగా పుట్టిపెరగుచున్నదని తోచునట్టి హేయమైన,

# శరీరము.

యొక్క స్వభావమును రామచంద్రు డిట్లుచెప్పుచున్నాడు.

,,శ్లో॥ ఆర్ద్రాంత్రతంత్రీగహనో, వికారీ పరితాపవాన్।
కాయః స్ఫురతి సంసారే, సోపిదుఃఖాయ కేవలం॥,,

అనగా, ధ్వనిగల పచ్చి నరములను తంతులతో గుట్టుచు దృశ్యమగుచు, పెరుగుచు, వృద్ధుచు, సగ్గుచు, నశించుచున్న, షడ్వికారములు గలిగిన శరీరము, సంసారదుఃఖము ననుభవించుటకే స్ఫురించుచున్నది.

,,శ్లో॥ స్తోకేనానందమాయాతి, స్తోకేనాయాతి ఖేదృతాం।
నాస్తి దేహసమశ్శోచ్యో, నీచోగుణ వివర్జితః॥

అప్పటి కన్నపానాదులు దొరికిన అతిసంతోషమును, దొరకకున్న అతిదుఃఖమును జెందును. శరీరమువలె దుఃఖపడునదియును, నీచమైనదియును, గుణములేనిదియును మరియొకటిలేదు.

,, శ్లో॥ కళేబరమహంకార గృహస్థస్యమహాగృహం×××''

అహంకారము అను సంసారికి శరీరము యిల్లుగానున్నది. ఆసంసారికి దశేంద్రియములను పశువులపాడియును, చంచలమగు ఆశయను యిల్లాలును, సంకల్పవికల్ప కారణమైన మనస్సను సేవకుడును సంసారమై యున్నది. వారి కానందమును గలుగ జేయుదానితో నాకేమియు ప్రయోజనములేదు.

,,శ్లో॥ జిహ్వామర్కటికాక్రాంత, వదన ద్వారభీషణం।
దృష్టదంతా స్థిశకలం, నేష్టం దేహ గృహంమమ॥
శ్లో॥ కింశ్రియా, కించరాజ్యేన, కింకాయేనకిమీహయా।
దినైఃకతి పయైరేవ, కాలస్సర్వం నికృంతతి॥,,

కోతివంటి వక్రస్వభావముగల నాలుకయును, పదునుగల పలువరుసయను నెముకల తునుకలును, గల ముఖమను వాకిలిగల యీశరీరము, సంపదలతోటి యెల్లకాలమును వుండునట్టిదియైనను కోరదగుదు. అట్లుగా

క మృత్యుకాలము రాగానే పోవుచున్నదిగాన శరీరమునం దాసక్తిలేదు. మరియును, శరీర మెట్టి హేయమైనదనగా,

శ్లో॥ రక్తమాంసమయస్యాస్య, సబాహ్యాభ్యంతరం మునే।
నాశైకధర్మిణో బ్రూహి, కైవ కాయస్య రమ్యతా॥

లోపలను వెలుపలను గీ॥ చీము నెత్తురు చేతను చిత్తుకుచుండు। మూత్ర మలసంయుతంబులై మురికితోలు। కండలెముకలు ప్రేవులు నిండియుండు। యిట్టి దేహంబులం దిక నేది సుఖము॥ యనునభిప్రాయమును రామచంద్రుడు జెప్పెను.

ఇట్టి హేయమయిన శరీరమును దాల్చిన మనుజుడు మరియొక హేయమైన శరీరముగల స్త్రీయను దానితో గూడుటకు గోరుచుండుట అవివేకమే కదా,

“శ్లో॥ స్తనౌ మాంసగ్రంథీ, కనకకలశావిత్యుపమితౌ।
ముఖం శ్లేష్మాగారం, తదపిచశశాంకేన తులితమ్।
స్రవన్మూత్రక్లిన్నం, కరివరశిరః స్పర్ధిజఘనం।
ముహుర్నిన్ద్యంరూపం, కవిజనవిశేషైర్గురు కృతమ్॥”

యను బర్తృహరి వాక్యము చొప్పున,

క॥ చన్నులు మాంసపుముద్దలు। కన్నులు దుర్జలము బుసులుగా రెడితో రటల్। వెన్నులు నెముకలపాతర। లన్నులనిటు తెలసివలచుట వివేకమే కా॥

యని యోచించక, భ్రమపడి

“శ్లో॥ ఖగౌవా, కుచౌవా, కనక కలశౌవా”

చక్రవాకపక్షులో స్తనములో బంగారుగిండ్లో యనియును “కిమబ్జం కింవదనం, ~~[illegible]~~ కింముకురబింబం” తామరపద్మమో, ముఖమో, స్ఫటికబింబమో, యనియును, బిల్హణునివంటి కామాతురజన ప్రీతికరమైన కవిచమత్కారవాక్యములకు మోసపోయి దుఃఖములను దెచ్చిపెట్టుకొనుచుండును. ఇదిగాక

“శ్లో॥ జరాకాలే జరామేతి, మృతికాలేతథామృతిం।
సమయేవావిశేషజ్ఞః, కాయోభోగి దరిద్రయోః॥”

గీ॥ ముదిమికాలమైన ముదిమియు పొడమూపు।
మరణకాలమైన మరణమొదవు।
పేదవానికైన పృథివీపతికినైన।
సమము దేహములకు సహజమిదియు॥

గావున క్షణమగుపడి మరగిపోవు మెఱుపులున్ను, శరత్కాల మేఘములున్ను, గంధర్వనగరములున్ను, స్థిరమైనవని యెవరునమ్మెదరో అట్టిమూఢాత్ములే శరీరములు శాశ్వతములను కొని వాటియందు ఆశయుంచుదురు. అని రామచంద్రుడు జెప్పెను.

ఇట్లే, ,,శ్లో॥ నివృత్తాభోగేచ్ఛా, పురుషబహుమానోపిగళితః।
సమానాః స్వర్యాతాః, సపదిసుహృదో జీవితసమాః।
శనైర్యష్ట్యుత్థానం ఘనతిమిర రుద్ధేచనయనే।
అహోధృష్టః కాయస్తదపి మరణాపాయచకితః॥''

అనుభవించుటకు శక్తిలేక భోగముల యందాశ పురుష గర్వము, స్నేహితసమూహము, కంటిచూపు, అన్నియును పోయినవి, కఱ్ఱ లేక కాలుకదల్చజాలను, యెందుకీబ్రదుకు, మరణమేమేలయ్యును; సిగ్గుమాలిన యీశరీరము మరణమన్న భయపడుచున్నది, యేమి ఆశ్చర్యమని భర్తృహరి జెప్పియున్నాడు. కొందరు, యెవరైన మరణించినవర్తమానమునువిని వానికాయుష్షు తీరి పోయెనని- తాము స్థిరముగా నుండునట్లు భావించుకొని చెప్పుదురు. రామతీర్థస్వాములవారు కాశిలో తన యాప్తుడొకడు మరణించగా ఆశవము వద్దికిబోయి చేతితోతట్టుచు ,,సోదరుడా! నీవుముందుబోయిన నేను నీవెనుక వచ్చెదనని చెప్పెను'' ఇదికదా శరీరస్థితిని నిజముగ దెలిసికొనినవారి లక్షణము. వీరే '*Thieves will enter the house when it is unguarded*'' ఇంటిని అజాగ్రతగా వదలిన దొంగలుదూరుదురు. అని జెప్పిరి. అటుగా, శ్లో॥ సదేహం వినారుద్రః, పురుషైర్ వేద్యతేపరః' అను కూర్మపురాణోక్త ప్రకారమును ,నాస్త్యారోగ్యసంబంధనం' అను అగ్నిపురాణోక్తప్రకారమును శరీరమును జ్ఞాన సంపాదనకొరకు కాపాడుకొని ఆరోగ్యస్థితియందుంచుకొనవలసినదే కాని, అట్లు జ్ఞానసంపాదనమను బందోబస్తును చేసికొనక శరీరమును వ్యర్థముగ వదలిన యెడల పైనజెప్పినట్లు అహంకారమను గృహస్థుడు యింద్రియములను దొంగలతోటి ఆక్రమించుకొని అన్నిదుఃఖములను దెచ్చిపెట్టునని తాత్పర్యము. అట్లుగాక తాయుమాన స్వాములవారు జెప్పినట్లు, ,దేహాది పొయ్యేనవే, తేర్న్ద వుపశాంతరుకుర, మోగాదియుండోమె ప్రివాయ్, పరాపరమే॥' యీశరీరాది సమస్తవస్తువులును నశ్వరములని చక్కగ దెలిసికొని జ్ఞానమును సంపాదిం

చి విశ్రాంతిని జెందియుండు మహానుభావులకు మోహాదివికారములు కలుగనేకలుగనేరవు అని తాత్పర్యము. గాన, ,గాలిబర్వకే యుళ్లి తూర్కికొళ్ళో' యని శ్రీపురంధరదాసువారు జెప్పినటుల, గాలియుండగనే తూర్పార బెట్టవలయును (*Make hay while the Sun shines*) అనగా రోగజరామరణాది యుపాధులు సంభవించక శరీరము బాగుండునప్పుడే కష్టపడి జ్ఞానమును సంపాదించి కడతేరుమార్గమును వెదకి దెలిసికొనవలయునని తాత్పర్యము.

(ఈయుపన్యాసాంతమున శ్రీస్వాములవారు సభవారినిగూర్చి, పైనజెప్పినప్రకారము శరీరాదులు అస్థిరములనియును సుఖమునిచ్చునది కాదనియును, మోక్షసుఖమునిచ్చునట్టి మార్గము నొకటియున్నదనియును అట్టిమార్గము నింకను దెలిసికొనలేదే, అయ్యో యింతకాలమును నున్న యాయువు వ్యర్థముగా పోయినదే యను దుఃఖమును జెందిజెంది మరిగుంది నేగదా మీకు ప్రపంచవికార కార్యసంకల్పములు వదలి మనస్సు సచ్చిదానంద పరబ్రహ్మమునందు లీనమై మీరు సుఖింతురని శ్రీ తిరుప్పాణి యాళ్వార్లు సాధించిన ,,కొండలువణ్ణనై, కోవలనాయ్, వెణ్ణెయుండవాయాన్, యెన్ వుళ్లంకవర్ న్దానై, అన్దర్ కోన్, అణియరంగన్, యెన్ అముదనై కణ్డకణ్‌కళ్, మట్రొన్రినై కాణావె'' (అనగా, శ్రేష్ఠమైన గుణములు గలిగినట్టిన్ని, పశువులను గాచునట్టిన్ని, నామనస్సును ఆకర్షించినట్టిన్ని, దేవతలకందరకును దైవమయినట్టిన్ని, నాకు అమృతతుల్యుడైనట్టిన్ని భగవంతుని సేవించిన నాకన్నులు మరియొకపదార్థమును చూడను కోరనే కోరదు,) అను పాశురమును జెప్పుచుండునప్పుడు, వారి కమితానందపరవశత్వమువలన శరీరమును మఱచి వారినేత్రములనుండి ఆనంద భాష్పము లొలికి సభవారినందరిని సోకుడు-పొడిజల్లినట్లు తనువులు ఝల్లుమనిపించి స్వాములవారియందదివరకు నుండిన గురుభక్తి విశ్వాసములను ద్విగుణించినది. ఇట్లు యీవిలేఖకుడగు సభవారివిధేయుడు.)



ఓం.

జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము

( తొమ్మిదవ సంచిక. )








ఇది,

శ్రీమాన్, బ్రహ్మశ్రీ బెంగుళూరు

పండిత శ్రీనివాస భాగవత స్వాములవారిచే

నుపన్యసింపఁబడి

శ్రీయుత సి. యస్. రావుగారిచే వ్రాయఁబడి

మద్రాస్

శ్రీలక్ష్మీనృసింహ విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

8-9-14

ఓమ్.

శ్రీమాన్, బ్రహ్మశ్రీ. బెంగుళూరు, పండిత, శ్రీనివాస భాగవతస్వాముల
వారిజ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము.

# వైరాగ్యప్రకరణానుబంధము.

(తొమ్మిదవ సంచిక.)

శ్రీయుత, సి. యన్. రావుగారు యిట్లు వ్రాసిరి:—

నేటియుపన్యాసారంభమున శ్రీస్వాములవారిట్లు చెప్పిరి:— నేటి చంద్రగ్రహణమగుటవలన జ్యోతిశ్శాస్త్రానుసారముగ గ్రహణవిషయమును గురించి కొంత యుపన్యసించమని కొందరుకోరిరి. ఆవిషయమును వొకటి రెండుమాటలలో యిపుడు చెప్పేసిమిగాన, మరియొకప్పుడు ఆవిషయమును ప్రసంగించవచ్చుననియును, మనకిపుడు వైరాగ్యవిషయము గొప్పదియును, అత్యావశ్యకముయినదియును, మోక్షసాధనద్వారమునై యున్నది. గాన, శ్రీరాములవారికి గలిగియుండిన వైరాగ్యపద్ధతిని చక్కగ దెలిసికొని ఆప్రకారము మనముయుండుటకు ప్రయత్నపడి పాటుపడవలసియున్నది. పాటుపడకుండిన బ్రహ్మజ్ఞానము కలుగదు. మోక్షమును బొందజాలరు. *(Bible)* బైబిల్ అను క్రయిస్తవ వేదమునందుగూడ *'Ask, it shall be given: Knock, it shall be opened'* అడిగినట్లయిన, యివ్వబడును, తట్టినట్లయిన తెలవబడును. అనియున్నది. అనగా, శ్రద్ధగలిగి వేదాంతశ్రవణ, మనన, నిధిధ్యాసనములయందునకష్టపడి సాధనచతుష్టయసంపత్తి గలిగి సద్గురువునాశ్రయించిన, జ్ఞానోపదేశమును జేయుననియును, అట్లు జ్ఞానముగలిగిన మోక్షద్వారమును తెరువబడుననియును తాత్పర్యము.

ఇట్టివైరాగ్యము ముముక్షువునకు మున్ముందుగ గలుగవలయుననుట, మనవలె, 'ఏకమేవాద్వితీయం' భగవంతుడొకడున్నాడు, అను నమ్మికగల ఆస్తికమతస్థులకందరకును అవశ్యకమైనదైయున్నది. ఇట్లు క్రైస్తవులును *(There is but one good)* భగవంతుడు వొకడైయున్నాడని (పాపములనుబాపి సుఖమునిచ్చు మోక్షమున్నదని) నమ్ముచున్నారు, మ్లేచ్ఛులును అట్లే వారిఖొరానను వేదమున, 'కుల్ హూ, వల్లాహూ, అహద్ ×× లాయిలా యిల్లలా' భగవంతుడు వొకడైయున్నాడు, అని జెప్పియున్నట్లు (మోక్షమునునదికలదని) నమ్మియున్నారు. ఇట్టి మోక్షాపేక్షగలవారిలో, సమస్తాపదలకును దుఃఖములకును కారణమగు యీసంసార

సంబంధమయిన పదార్థములయందునను, విషయాదులయందునను, వైరాగ్యము యెవరికి దోచకుండును.

పాటుపడక పట్టిమాటలతోగాని శాస్త్రపరిచయముతోగాని యిట్టి వైరాగ్యముగాని వివేకముగాని కలుగనేరదు. అవ్వికలుగనివారికి గురూపదేశము జేసిన, గ్రుడ్డివాని చేతియద్దమువలెను, చెవిటివానిముందు సంగీతమువలెను, చవటినేలనాటిన విత్తనమువలెను, యేమాత్రమును ప్రయోజనకారికాదు. మనోవాక్కర్మలను త్రికరణములవలన దృఢముగ శ్రవణమననాదులు జేయవలయును. విస్తారముగ వేదశాస్త్రపురాణములను చదివినమాత్రమున పండితుడుకాడు, విజ్ఞానశాస్త్రమును దెలిసినవాడే పండితుడు, ఇందుకు దృష్టాంతముగ— ఒకానొక హిందువు బి.యే. మొదలైన పట్టపరీక్షలందు తేరి, బారిష్టరు (గొప్పవకీలు) పరీక్షనిచ్చుటకు లండను (సీమకు) పోయెను. అక్కడ జ్ఞానవేత్తయగు గొప్పదొరయొకడు ఆహిందువునుజూచి, నీవు యిచటికి యెందుకు వచ్చితివని యడిగెను. అందుకా హిందువు, బారిష్టరు పరీక్షనిచ్చుటకువచ్చితినని జెప్పెను, పిదప నీవేమిజేయుదువని యడిగెను: మాపట్టణమునకు బోవుదునని చెప్పెను, ఆవల యేమిజేయుదువని యడిగెను: కోర్టులలో వాదించి ద్రవ్యము నార్జింతునసెను, ఆవల యేమిజేయుదువని యడిగెను; వివాహముజేసికొని సంతానమును బడయుదుననెను, ఆవల నేమిజేయుదువని యడిగెను: స్థిరచరాస్తులను సంపాదించుదుననెను, ఆవల నేమిజేయుదువని యడిగెను: సంసారముతో సుఖముగనుందుననెను, ఆవలనేమిచేయుదువనియడిగెను; వృద్ధాప్యముసంభవించియుందుననెను, ఆవల నేమిచేయుదువనియడిగెను; తుదకు మృతినొందుదుననిచెప్పుచు తెల్లబారిన ముఖముతో కలతనొందిన మనస్సుగలవాడైయున్న వానినిజూచి, నివెవరైనదియును, యెట్లుబుట్టినదియును, యేదిమృతినొందునదియును, మృతినొందిన పిదప నీవేమగునదియును దెలియునా యని యడిగెను, ఆహిందువు అన్నియును జదివి మోక్షమార్గమయిన యీధర్మసూక్ష్మమును జదువుకొనలేదుగాన ఖిన్నుడై వేదాంతశాస్త్రమును చదువనారంభించి నట్లొక కథయున్నది. అట్టి చదువుచదువుగాదు. చదువనగ నెట్టిదనగా, తొల్లిధర్మరాజు అతి బాల్యమున జదువుకొనునపుడు, ఆయన విద్యాగురువులైన ద్రోణాచార్యులు, యితర బాలురతోపాటు, పాఠపుస్తకమునందున్న 'సత్యంవదా' సత్యమును పలుకుము,'ధర్మంచరా,

సత్కర్మమును చేయుము, అను రెండు నీతివాక్యములను చెప్పెను. ఆపుస్తకములోని వాక్యములన్నియు నట్టి సులభమయిన చిన్నవాక్యములుగాన యితరబాలురందరును పుస్తకమును పూర్తిగ చదివిముగించిరి. ధర్మరాజుమాత్రము పైరెండువాక్యములకు పైన పాఠముచేయనేరకుండెను, విద్యాగురువు అందుకు కోపించి యడుగగా, స్వామీ! మొదటి రెండు నీతివాక్యములను నేను చక్కగ గ్రహించి ఆచరించుటకు శక్తిలేనివాడనై యుండగా తక్కినవాటిని నేనెట్లుగ్రహించగలనని ధర్మరాజు బదులుచెప్పెను. ఇట్టిది కదా మహాత్ముల దృఢమైన మనోపాకమును, గానే, *Greatness does not existin reading and talking but in being and becoming* యని చెప్పియున్నది. అనగా, వేదములను చదివి వాదములను జేసినంతమాత్రమున జ్ఞానులుగారనియును, (సంకల్ప వికల్పాత్మకమైన మనస్సును స్వాధీనపరచుకొని ప్రపంచము మొదలగు వాటిని మరచియుండవలయునని తెలిసికొని) గురువు చెప్పినట్లు చేయుచునుండువారే పండితులనియును, జ్ఞానవేత్తలనియును, తాత్పర్యము.

పైదినముల నుపన్యాసములను నేనుజేయుటయును మీరు వినుటయును యేమినిశ్చయము. *many a slip between the cup & the lip* చేతనున్నది నోటికిబోవుట నిజములేకున్నది, నోటనున్నది కంఠముదాటువరకేమి నిజము, మీరు యిదివరకు వినినంతవరకైనను మరువక మననముచేయుచుండవలయును. ఇపుడచ్చువేసిన పుస్తకరూపముగ ప్రచురమగుచున్న యుపన్యాససంగ్రహములోని యంశములను జూచుకొనుచుండిన మీరు వినినవిషయములలో ముఖ్యమయినవాటిని మరువక స్మరణకుదెచ్చుకొనుటకు సహకారియైయుండును, అనిచెప్పి పిదప క్రిందటిదినమున జేసిన యుపన్యాసము నందుకొని యిట్లు చెప్పిరి.—

రామచంద్రుడు, అట్లు మొదట సాంసారిక ప్రయోజనము కొరకు ప్రధానమయిన ధనమునందునను, అట్టి ధనమువలన గలుగు దీర్ఘజీవితాపేక్షయందును, అట్లుఆయుష్యువలన గలుగు, నేను, నాదియను, అహంకారమునందును, అట్టి అహంకారమువలన గలుగు సంకల్ప వికల్పములు గల మనస్సునందునను, తనకు గలిగిన వైరాగ్యస్థితిని తెలిపి, అట్టిమనస్సువలన గలుగు భోగేచ్ఛారూపస్వప్న,

# తృష్ణ (ఆశ)

అను దానిగూర్చి యిట్లు రామచంద్రుడు విశ్వామిత్రునితో జెప్పెను.

శ్లో॥ హార్దాంధకార శర్వర్యా, తృష్ణయైవ దురంతయా ।
స్ఫురంతి చేతనాకాశే, దోషకౌశికపంక్తయః ॥

చీకటిగల రాత్రికాలమునందు, గుడ్లగూబల గుంపులు బయలుదేరునట్లు, మనస్సుతోగూడిన ఆశయను అంధకారమయిన చిదాకాశములో కామక్రోధాదులను దోషములుబుట్టినవి, యిందువలన నేమైన దనగా,

శ్లో॥ యాంయామహామవీతాస్థాం, సంశ్రయామి గుణశ్రియం ।
తాంతాంకృంతతి మేతృష్ణా, తంత్రీమివకుమూషికా॥

నేను ఆసక్తితో యెట్టి సత్కర్మలనుజేసితినో వాటినన్నిటిని యాశయనునది, యెలుకలుదారమును కొరికి తెంచివేసినట్లు, త్రెంచివేసినది, గాన నేనును నావంటివారును యెట్లున్నామనగా,

శ్లో॥ గంతుమాస్పదమాత్మీయం, సుసమృద్ధియోవయం ।
తృష్ణాజాలేపిముహ్యామో, జాలేశకునయోయథా ॥

వలయందు జిక్కుకొని దప్పించుకొనలేకయున్న పక్షులవలె, ఆశయను దాని వలలోజిక్కి ఆత్మజ్ఞానమును బొందుటకు అశక్తులమై తపించుచున్నాము, ఇదియునుగాక,

శ్లో॥ తృష్ణాభిధానయాతాత, దగ్ధోస్మిజ్వాలయాతథా ।
యథాదాహోపశమన, మాశంకేనామృతైరపి ॥

ఈ ఆశయను అగ్నిజ్వాలవలన అమితముగ దహించబడితిని, అదహాస వేదన అమృతస్నానపానములవలననైనను, చల్లబడునని తోచకున్నది, ఇట్టిఆశయ యెంతటి శక్తిగలదియనగా,

శ్లో॥ భీషయత్యపిధీరేహం, మంధయత్యపిసేక్షణం ।
ఖేదయత్యపిశాంతేహం, తృష్ణాకృష్ణేవశర్వరీ ॥

అమావాస్యచీకటివలె యెట్టిధైర్యవంతునైనను భయపెట్టును, బుద్ధిమంతుని కన్నులుగలవానినైనను గ్రుడ్డివానిగజేయును, యెట్టిశాంతచిత్తముగలవానికైనను దుఃఖమును గలిగించును, యిట్టి శక్తిగలదియైనను యేమయినను ప్రయోజనముగలదా యనిన

శ్లో॥ అనాఘ్రాతచిత్రాపి, సర్వమేవానుధావతి ।
సహాపైత్యశ్లంకించి, తృష్ణాజీర్ణేవకామినీ ॥

శ్లో॥ యన్నశక్నోతితత్రాపి, ధత్తేతాండవనీంగతిం ।
నృత్యత్యానందరహితం, తృష్ణాజీర్ణేవనర్తకీ ॥

ముసలితనమున జారస్త్రీయును, ఆటకత్తెయును, పురుషుల మనస్సును ఆకర్షించుశక్తియును, తమకేమాత్రమును ఆనందమును ప్రయోజనమును లేకనే విటపురుషుల ననుసరించి తిరుగుచు ఆనందముగలిగియున్నట్లు నె ట్లునటింతురో, అట్లే యీఆశయును నిష్ప్రయోజనముగ నందరిని ఆశ్ర యించి సుఖములేనిదే నృత్యనట్లు నటించుచున్నది.— మరియును, యీ 'తృష్ణాచపలమర్కటీ' ఆశయను చపలచిత్తపు కోతి, యొకచోట నిలువక, ఆకాశమునందును, పాతాళమునందును, ఏనాను నొక్కముగా నొకచోటికిని యీరులస్ని దిక్కులయందును వెంతకును దృప్తినొందక తిరుగుచుండును, ఈ ఆశ మరియు నెట్టిదనగా,

శ్లో॥ సర్వసంసారదోషాణాం, తృష్ణైకాదీర్ఘదుఃఖదా ।
అంతఃపురస్థమపియా, యోజయత్యతిసంకటే ॥

సంసారమునందు సంభవించు అన్నిదుఃఖములలోకి ఆశయే అధికదుః ఖమును కలుగజేసి అంతఃపురమునందున్న రాజాధిరాజునైనను అతిసంక టమునందు పడవేయును, కట్లు

శ్లో॥ రోగార్తిరంగనాతృష్ణా, గంభీరమపిమానవం।
ఉత్తానతాం నయత్యాసు, సూర్యాంశవ ఇవాంబుజ॥

రోగమయును, స్త్రీయును, ఆశయును, యెట్టిగాంభీర్యవంతుడైనను మిగుల వెలితిపరచును, గావున

శ్లో॥ లోకోయమఖిలంధుఃఖం, చింతయోజ్ఝితయోజ్ఝతి ।
తృష్ణావిషూచికామంత్ర, శ్చింతాత్యాగోహికథ్యతే॥

మనుజులు విషయచింతను విడిచిపెట్టినయెడల, సమస్తదుఃఖములును విడిచిపోవును, అట్లువిడుచుటయే, ఆశయను విషూచికారోగము (కలరా) ను పోగొట్టుటకు మంత్రమైయున్నది.— మరియును, ఈఆశ కత్తికన్నను, పిడుగుకన్నను, యెఱ్ఱగ కాచిన యినుమునకన్నను తీక్ష్ణమైనదియై యు న్నది, యెట్టిపండితునైనను, శౌర్యవంతునైనను, ధైర్యవంతునైనను నిమి

షమాత్రములోన గడ్డిపోచతో సమానుసిగ జేయును. అని రామచంద్రుడు ఆశయొక్క స్వభావమును జెప్పెను.

ఇట్లు 'ఆశకోఱ రళవిల్లె, అఖిలమెల్లాంకట్టియాళినుం' అని తాయిమానుస్వాములవారు చెప్పినట్లు అఖండభూమి నాక్రమించుకొని యేలుచుండినను ఆశకు అంతములేదు. ఒకానొక బ్రాహ్మణవృద్ధుడు రాజమందిరమార్గమునబోవుచు మేడమీద వినోదముగ విహరించుచున్న రూపవతియగు రాచపుత్రికనుజూచి పరవశుడై కంటిరెప్పవేయక జూచుచు నిలుచుండగా, యారాజుచూచి, నీవెవడవు, యెందుకట్లు నాబిడ్డనుజూచెదవని కోపించగా, రాజా! నీపుత్రికయొక్క సౌందర్యమును జూచుచున్నాను, *Beauty is not for those who possess but those who enjoy it* సౌందర్యమనునది దానినిజూచి యనుభవించువారి సుఖముకొఱకేగాని, యా సౌందర్యమును గలవారి సుఖముకొఱకుగాదని యాబ్రాహ్మణుడు బదులు చెప్పెను. అందుకు రాజు మిక్కిలి యాగ్రహపడి వానిని యూరిబైటికి నెట్టించెను. స్త్రీలు 'దర్శనాదరి సతే చిత్తం । ద్దర్శనాద్ర సతేషనం । సంగమాంద్ర సతేసత్వం నా ప్రత్యక్ష రాక్షసీ॥' చూచినంతమాత్రమున, మనస్సును, ధనమును, కలసినంతమాత్రమున బలమును హరించునట్టి ప్రత్యక్ష రాక్షసులనియుండుటవలన, నాబ్రాహ్మణుడా రాజకాంతపైనున్న యాశతో ఆచెంతనున్న కాళికాదేవాలయమునకుబోయి యాదేవి బైట సంచారముబోయియున్నందున లోపల ప్రవేశించి తలుపుమూసికొనియుండెను, కొంతసేపటికి, కాళికాదేవివచ్చి తలుపుతట్టగా, నాకు మూడువరములిచ్చెదనని చెప్పిన తలుపుతెఱచెదనని నెను, అట్లేయిచ్చెదనని కాళికాదేవి చెప్పి తలుపుతెఱపించి లోపల ప్రవేశించి నీకేమి వరములు గావలయునని యడిగెను. నేనీదేశమునకు రాజుగావలసిన దొక వరమును, రాజుకొమార్తెను వివాహముగావలసిన దొకవరమును, మరియెప్పుడు నేనడిగినపుడు మూడువరములిచ్చునట్లు యొకవరమును, దీసికొనిపోవుచుండగా, యారాజు అకస్మాత్తుగ మృతినొందగా పట్టపేనుగచే పంపబడిన పుష్పమాలిక యాబ్రాహ్మణుని కంఠమునందు వేయబడి యాదేశమునకు రాజై పిదప యారాజుకొమార్తెను తానువివాహముజేసికొని, మరల యాకాళికాదేవి యొద్దకువచ్చి, తాను మంచియావనవంతు డగుటకు యొకవరమున్ను, అన్ని రాజ్యములున్ను తనస్వాధీనమగుట కొకవరమున్ను, మరల యెప్పడ

డిగినను మూడువరము లిచ్చుటకును మాటదీసికొనివచ్చి యౌవనదశకు వచ్చి అన్నిరాజ్యము లాక్రమించుకొని, మరలయాదేవివద్దకుబోయి తనకింక ననేక రాజకన్యలు భార్యలుగ నగుటకును, అణిమాదిసిద్ధులు గలుగుటకును రెండు వరములను మరల యడిగినపుడు మూడవవరము లిచ్చినట్లును, మాటదీసికొనిపోయి కొన్నాళ్లుగడుపగా, రాజ్యవిస్తారమువలన వ్యవహారముజరుపశక్యముగాక సంసారవిస్తారములవలన అనేకజననమరణాదిదుఃఖములుగలిగి మితిమీరినరాజ్యభారమును, సంసారభారమునుదుఃఖభారమును భరించజాలకఅన్నిటియందుమనువిరక్తిబుట్టిఅన్నిటినివదలిపెట్టిబయలుదేరిఅడవికిబోయి ప్రలాపించుచుండగా, కాళికాదేవిప్రత్యక్షమై నీకిప్పుడేమివరము కావలయుననియడుగగా, నమస్కరించి, తల్లీ నాకికనేమియునక్కరలేదు. 'ఓడినేన్ పెరుంపేరాశైయాల్, వులగిలూరు తారం వాండిడేయాడినేన్। తేడినేన్ కామచ్చేటిలేపిళుండు, తియంగినేన్, మయంగినేన్ । వాడినేన్ శెరియువారియాన్, మిహందేన్వంచమే పొరుళనమరిత్తు । నాడినేన్ యోని నుంపాడినేన్, వునయే నంబినేన్ కైవిడేల్యెనయే॥' యని రామలింగస్వాములవారు చెప్పినట్లు, తల్లీ నేను యిదివరకు ఆహార నిద్రాభయమైథునాదివిషయములలో మునిగి యవస్థపడినదిచాలును, యిప్పుడు నిన్నేనమ్మియున్నాను నన్నురక్షించ వలయుననియును, 'వాడినేన్వాడి, వరుందినేన్ మనత్తాల్, పెరుందుయరిడుమ్బైయిల్ పిఱన్దు । కూడినేన్ కూడి యిళైయవర్, దమ్మోడవర్దరుమ్ కలవియేకరుది×××××' యని తిరుమంగై యాళ్వార్లుజెప్పినట్లు 'భగవత్తత్వమొకటియున్నదని తెలియక విషయాదులయందుబడి కృశించితిని గడచినకాలము వ్యర్థముగా పోయినదని విలపించి, 'తందతాయునీ, యన్నయిర్తుణయునీ । శంజలమడఃశిరక్కవంద, దేశికవడివునీ, యునయలాన్ । మత్తొరుతుణైకాణేన్××××' యని తాయుమానుస్వాములవారుజెప్పినట్లు నానావిధములుగ ప్రార్థించెను. అట్లు ఆ బ్రాహ్మణునికి అట్టి వృద్ధాప్యమునందుగూడ స్త్రీ విషయాదులయందు ఆశవదలక, పరమభాగవత శిఖామణియైన త్యాగరాజుగారు చెప్పినట్లు '‘తప్పి బ్రతికి పోవతరమా- రామ,కలిలో। ముప్పున విషయతటాకమున, మునుగక దృఢమనసై॥ తప్పి బ్రతికి పోవతరమా×××××'' రాక్షసరాజైన రావణుడును, కురువంశపురాజైన దుర్యోధనుడును, రారాజైన చంద్రుడును, దేవరాజయిన యింద్రుడును, అట్టివారుగూడ తప్పించుకొ

నలేకపిషయాదులయందు ఆశయును దానిచే మోసపోయిచెడిపోయిరిగాన తప్పిబ్రతికిపోవతరమాయని చెప్పిరి. అట్లు తప్పినవారిలో యొకరైన మహానుభావుడైన వేదాంత దేశికాచార్యులవలె, అనగా, పూర్వము విజయనగపు రాజు తన రాజ్యమునకు రమ్మని ప్రార్థించగా,

శ్లో॥ క్షోణీకోణ శతాంశపాలనకలా దుర్వార గర్వానల।
క్షుభ్యత్ క్షుద్రనరేంద్ర చాటురచనా ధన్యాన్ నమన్యామహే।
దేవం సేవితుమేవ నిశ్చినుమహే యోఽసౌ దయాళుః పురా।
ధానాముష్టిముచే కుచేలమునయే దత్తేస్మ విత్తేశతాం॥

యని చెప్పినట్లు, అఖిలాండకోటి బ్రహ్మాండము నేలుచున్న ప్రభువును (భగవంతుని) ఆశ్రయించియున్న నేను, ప్రపంచమునందలి, భూప్రదేశములోని, యొక ఖండమునందున్న, యొక దేశములోని, యొక చిన్న రాజ్యమునకు రాజైనవనితో నాకు ప్రయోజనములేదని, భూద్రవ్య వస్త్రాభరణాది రాజసన్మానములయం దేమాత్రమును ఆశలేక దృఢమైన మనస్సు గలిగి దేశికాచార్యులుబదులు చెప్పి పంపెనని తాత్పర్యము. అట్టి దృఢమయినమనస్సు గలిగి ఆశయనుదానిని విడిచిపెట్టినగదా, రామచంద్రుడు చెప్పినట్లు సమస్తదుఃఖములును పీకిపోవును. 'భగవత్ తత్త్వవిజ్ఞానం, ముక్తిసంజన్యజాయతే' యనినట్లు ఆశనువదలిన పిమ్మటగదా, భగవద్విషయమునందు మనస్సులయించును, అట్లులయించినగదా 'భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయంతే చాస్యకర్మాణి, దృష్టఏవాత్మనీశ్వరే॥' యను భాగవతప్రమాణరీతిగ ఆత్మస్వరూపదర్శనముగలిగి, మనోబంధము వదలి అన్ని సంశయములును కర్మములును బొత్తిగ నశించిపోయి సదానందసుఖ సామ్రాజ్యమును జెందుదురు.

అట్టి యానందము లభించుట కెన్నియో విఘ్నములు గలుగ వచ్చును, మహానుభావులైన రామలింగస్వాములవారు చెప్పినటుల,

"కళకళ్ మరం, పోదు, నటవం, నాన్ కండుకొండ తరుణం, కడచ్చిదియేన్, వుప్పుం, పూత్తు, కాయిత్తపోరుకాయిదాన్, విళక్కుమరం, పట్టుత్తిదుమో, వెంబి వుదిందిదుమో, వెంబాదు, పట్టుక్కిడనుం, యన్కరి త్తిల్లఘుపదుమో, కొళకళరుదుమలమాన్నైమె, కొరంగుకవిందిదుమో, కొరంగుకవిరాజనదు, కురిప్పిల్లఘుప్పదుమో, వాళకళ్మరవృణ్ణువెనో, డొన్డైవుకళ్కొళ్ళ్ల్లుమో, శోదతిరువుళమధువో, అరిందిలమే॥"

అనగా.— నాలోని ఆనందము, యిట్టిదే భూమిగుండు విస్తీర్ణవిస్తీర్ణ ములో మూసికొని యున్న సత్తువలె నున్నది. యెన్నడు మొలకెత్తి పుష్పించి, ఫలితమగునో తెలియదు, ఫలితమైనను, మా యాప్తుడనినాతే బడనుండుట, పడకుండినను, దృష్టిగోచరమగుట, అయినను, చేతికందుట, చేతికందినను, నోటికందుట, నోటికందినను, కంఠము దాటుట, దాటినను, కడుపునిండుట యేమినిజము.— గాన పరబ్రహ్మానందామృత పానము చేయుట కన్ని విఘాతములును అంతకష్టమును వున్నగాని తెలియవలయును. మనమిప్పుడు వైరాగ్యమను విత్తనమును చేసుకొనుకొని యున్నాము, దానిని మన హృదయమను భూమిని నాటి మొలకెత్తి పుష్పించి ఫలించి వృక్ష ముగ నిలచి క్రమముగ తత్ఫలమున్న ప్రకరణముల గ్లైకూ సిద్ధాంత పద విని చేరి నిరంతరానంద సుఖఫలమును ననుభవించుటకు శీఘ్రపడవలయును. సంసారాములయందు ఆశను వదలి వైరాగ్యము నొందవలయునని సదా పదే యుపదేశించుటవలన యిచ్చట వచ్చియున్న మన మాతా సుత సోదరీలసమానులైన స్త్రీలు ఆయాసపడరాదు. నేను యనుగా "సర్వకర్మాణి మనసా, సన్న్యస్యాస్తే సుఖం వశీ" యను భగవద్గీతా వాక్యము ననుసరించి, అనిత్యములైన అన్నపదార్థములయందున్ను అనవరత ఆశాపాశములుంచుకొని దుఃఖముల పాలుగాక మనస్సునందువదలి తామరాకు నీళ్లు, మన్ను కుమ్మరపురుగులలె, అంటీ అంటకనుండి సుఖించవలయునని జెప్పుటయే గాని, ఆలుబిడ్డల నలయించి అన్నిటిని వదలి యడవులకు బొమ్మనుటగాదని గ్రహించవలయును.

(ఇట్లని వుపన్యాసాంతమున శ్రీభాగవతస్వాములవారు సభవారిని జూచి పుత్రవాత్సల్య నిష్యజనాభిమాన జీవకారుణ్య గుణములాధికారరస మిశ్రితమై అమృతము లొలుకు పలుకులతో జెప్పినది అత్యద్భుతమై సభవారి వినయవినోదముల నాకర్షించినది. ఇట్లు సభవారి విధేయుడగు విలేఖకుడు.)

